

# స్రవంతి

సాహిత్య మాస పత్రిక

భారత రాష్ట్రపతి



శ్రీ జైల్ సింహ్

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

# 352


ఆగస్టు, 1983 : సంపుటి : 30, సంచిక : 5

వార్షిక చందా : పది రూపాయిలు : విడిప్రతి : ఒక రూపాయి



సంపాదకులు:

వేమూరి రాధాకృష్ణమూర్తి

## ఈ సంచికలో

సంపాదకీయం:

# ఆంధ్రప్రదేశ్ లో భారత రాష్ట్రపతి శ్రీ జైల్ సింహ్

భారత రాష్ట్రపతి శ్రీ జైల్ సింహ్ హైదరాబాదు విచ్చేసి అనేక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. పాల్గొన్న ప్రతి సభలోను వారు హిందీ లేక హిందుస్తానీలోనే ప్రసంగించారు. తమిళనాడులో కూడా హిందుస్తానీలోనే ప్రసంగిస్తున్నారు, భారతదేశంలో ఎక్కడికి వెళ్ళినా భారతీయ భాషయగు హిందీలోనే మాట్లాడవలెనని వారి నిర్ణయం. రాష్ట్రపతి నిలయంలో సైతం ఎవరు ఏ భాషలో ఏమి చెప్పినా వినడం, తనుమాత్రం హిందీలోనే సమాధానం చెబుతూ ఉండడం గమనించదగిన విశేషం. ఫ్రాన్సు దేశాధ్యక్షుడు భారతదేశంవచ్చినప్పుడు ఫ్రెంచి భాషలోనే వారు ప్రసంగిస్తూవుండటం, అనువాదకులు ప్రక్కన వుండి ఇంగ్లీషులోకి మారుస్తూవుండటం యీ మధ్యనే భారతప్రజలు టి.వి.లో చూచే ఉంటారు. చాలాకాలం తరువాత అనగా మహాత్మాగాంధీ, ఆచార్యవినోబా భావే గారల తరువాత భారత రాష్ట్రపతి శ్రీ జైల్ సింహ్ నిష్ఠతో యీ క్రమాన్ని పాటిస్తూ భారతీయ భాషలకు ఎనలేని ఆదరణ కలిగిస్తూ వుండటం సంతోషకరమైన విషయం. ఇంగ్లీషులో మాట్లాడటం గొప్పతనంగా భావించబడుతూ, భారతీయ భాషల్లో మాట్లాడేవారు చులకనగా చూడబడుతున్న ఈనాటి స్వతంత్ర భారతదేశంలో భారత రాష్ట్రపతి యిట్టి నిర్ణయం గైకొనడం, తు. చ. తప్పకుండ ఆ నిర్ణయాన్ని పాటిస్తూ వుండటం గొప్ప విశేషం. భారత ప్రధాని లగాయతు వివిధ పార్టీలకు చెందిన పదాధికారుల వరకు అందరూ శ్రీ జైల్ సింహ్‌ను కనీసం యీ విషయంలోనైనా అనుకరించి భారతీయ భాషలకు గౌరవం కల్పించాలని కోరుతున్నాం.

శ్రీ జైల్ సింహ్ సచ్చరిత్రులు. త్యాగధని. సత్సాహిత్యకులు, సహృదయులు. ఆంధ్రప్రదేశ్ పర్యటనలో వారితోబాటు వుండటం, వారి హిందీ ప్రసంగాల్ని తెలుగులోనికి అనువదించే అవకాశం లభించడంవల్ల దగ్గరగా వుండి వారిని కొంతవరకైనా తెలుసుకొనే సదవకాశం చిక్కింది. దేశసమైక్యతనుగురించి, భాషా విభేదాలను గురించి, యీనాటి ప్రభుత్వపక్షం, వ్యతిరేకపక్షాల పోకడలనుగురించి యీనాటి సాహితీపరుల కర్తవ్యాన్ని గురించి, దేశభక్తులు అనుసరించవలసిన ఆదర్శవంతమైన ప్రవర్తనను గురించి, వివిధ మతాల సమైక్యతనుగురించి ఆంధ్ర

ప్రదేశ్‌లో పర్యటిస్తున్న సందర్భంలో భారత ప్రజలకు వారిచ్చిన సందేశాలు ఉన్నత స్థాయిలో వుండటమే గాక సుప్రభాతాలుగా కూడా ఉన్నాయి.

రాజమహేంద్రవరంలో వారు పాల్గొన్నవి సాత్త్వికగుణప్రధానమైన సాహితీ కార్యక్రమాలు. హైదరాబాద్‌లో వారు పాల్గొన్న ఒకటిరెండు కార్యక్రమాల్లో రాజకీయాల్ని చొప్పించుటకు వృధాప్రయత్నాలు జరిగినా రాష్ట్రపతి వాటికి అతీతంగానే వ్యవహరించారని చెప్పవచ్చు. రాజమహేంద్రవరంలో హిందూ, సిక్కు మతపరమైన కార్యక్రమాల్లో భక్తిశ్రద్ధలతో పాల్గొని ఆ క్రతువులన్నీ స్వయంగా అమితనిష్ఠతో పూర్తిచేసి సహృదయుల మన్ననల నందుకొన్నారు. రాజరాజ నరేంద్రుని ఆదర సత్కారాల నందుకొని మహాభారత రచనకు పూనుకొని ఆదికవిగా మాన్యత పొందిన నన్నయ్య కాంశ్యవిగ్రహం శ్రీ జైల్‌సింహ్‌వంటి భారత రాష్ట్రపతిచే ఆవిష్కరింపబడటం తెలుగువారికి గర్వకారణం. వారు రాజమహేంద్రవరంలో జరిగిన సభలో చేసిన ప్రసంగం తెలుగు ప్రజలను ఎంతగానో ఆకర్షించింది.

ఎంతోకాలానికి భారత రాష్ట్రపతి సింహాసనం అధిష్ఠించిన శ్రీ జైల్‌సింహ్ వంటి స్వదేశీ, స్వభాషాభిమానికి భారతదేశ భవిష్యత్తును తీర్చిదిద్దుటకు అవసరమైన ఆయురారోగ్యాలు, శక్తిసామర్థ్యాలు ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాము.

**వేమూరి రాధాకృష్ణమూర్తి**

# సూచన

**ది. 13, 14-8-1983 శని, ఆదివారంలలో ఆంధ్రప్రదేశ్ యందంతట సభ పక్షాన హిందీ పరీక్షలు జరుపుటకు ఏర్పాట్లు పూర్తి అయినవి. హిందీ ప్రచారకులు, పరీక్షార్థులు గమనించగలరు.**

# నిన్నటి కథలు

—నాగభైరవ కోటేశ్వరరావు

మహాప్రస్థానమ్ము రాసిన
మనిషిఎక్కడ? మనసు ఎక్కడ?
పవితల్లి శ్రీనివాసుని
జీవ నాదాలు?
"ఖడ్గసృష్టి"ని సలిపిపోరిన
కరము ఎక్కడ? కలము ఎక్కడ?
మోడరన్ మాతెలుగు కవితకు
డాడి ఏడమ్మా?
పౌరహక్కుల సభల్లోపల
సౌరదీపం వోలె వెలిగిన
ప్రభాకలితం, సభాజ్వలితం
పలుకులేవమ్మా?
అరశతాబ్దం 'ప్రతీకబద్ధం
అడుగు జనములకే నిబద్ధం'
అంచు అరచిన ఈ శతాబ్దివి
పంచి తెగినాదా?
ఇల్లుదాటని తెలుగుపలుకుకు
ఇలాతల తత్త్వమ్ము నేర్పిన
ఉన్నతోన్నత భావమెక్కడ
ఉంది చూపించు?
తనప్రభావం తన అనంతర
అనుజ తతిపై మనుజ తతిపై
ఉప్పెనై ముంచెత్తి తేల్చిన
ఒక్కడత డేడీ?
పూలవనిలో పొంచివుండిన
కాలసర్పం కాటువేస్తే
మార్పుకొరకై, ఊర్పువిడిచి
మాయమైనాడా?



తెలుగు లెక్చరర్,
ప్రభుత్వ మహిళా కళాశాల, చీరాల

# ఓకవీ! మహాకవీ!!

—సుపాణి

ఓకవీ!
కళారవీ!
మాకవీ!
మహాకవీ!
ఎటు నీ ప్రస్థానం ఎటు?
చెమటోడ్చే శ్రమజీవుల
చేవ్రాలువు నీవు
బలవంతుల ధనవంతుల
పన్నాగా లడగించే
ప్రభంజనం నీవు
వ్యధార్తజీవిత
యదార్థ దృశ్యం
కనులారా కన్న
ద్రష్టవీవు
బీదాబిక్కీ సంక్షేమానికి
పేదాసాదా సౌభాగ్యానికి
మరో ప్రపంచం నిర్మించాలని
అనవరతం తపనబడిన
స్రష్టవీవు
విప్లవ కవితాఘోషకు
వీరతిలకం దిద్దిన
కవితా రణరంగపు
యోధుడవయ్యా నీవు
నీ కవిత
చిరంజీవి
నీకీర్తి
అజరామరం
ఓకవీ!
కళారవీ!
మాకవీ!
మహాకవీ! ★

ఆఫీసర్,
స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, గుంటూరు

# మనదొక ధర్మక్షేత్రం

—మంత్రిప్రెగడ వీరభద్ర మూర్తి

సర్వ ప్రపంచంలో
సర్వ ప్రజానీకంలో
ఎవ్వరికి కనుపించని ధ్వని
ఎక్కడో ఒకచోట ఒకానొక వింత ధ్వని
ప్రతిక్షణం
నాకు వినుపిస్తోంది
నా హృదయంలో
ప్రతి ధ్వనిస్తోంది !
నా గుండెను
కదిలిస్తోంది! కరిగిస్తోంది !!
ఆ ధ్వని
ఎవ్వరిది? ఏ ప్రాణిది? ఏ ఆత్మది?
బాధలతో, మూగపోయిన కంఠం
ఆర్ద్రంగా అలమటించే అన్నార్తుల,
భయార్తుల, విగత జీవుల స్వగతాలతో
విశ్వవాయువుల్లో కలిసే ముందు
అంతరాత్మ పలికిన నాదమా?
నినాదమా? వేదమా? నిర్వేదమా?
అవినీతి జగతిలో
గతితప్పిన పతిత హృదయంలో
చెలరేగిన
చితుకుల మంటల చిటపటధ్వనియా?
తపించిన
జీవిత మంతా వ్యాపించిన కాళరాత్రి
చీకటిలో
నింగినుండి జారిన ఆశానక్షత్రమా?
వార్ధక్యభారంతో
కృంగి కృశించిన వ్యర్థజీవి ఆలాపమా?
నిరుపేద
నిస్వార్థజీవి
విసిగివేసారిన అనాథుల ఆక్రందనమా?
ఈ వేదనామయ
ప్రపంచంలో ప్రజానీకంలో ఎన్నెన్నిధ్వనులో
ఎందరు విన్నారు?

2

ఆనాడు, ఈనాడు ఏనాడూ
మనదొక ధర్మక్షేత్రం—మనదొకకురుక్షేత్రం
స్వార్థంతో
కాఠిన్యంతో
కరడుగట్టిన రాతిగుండెను చీల్చి
రక్తంపిండినా
మనసును కరగించే కరుణరసం కానరాదు
కదా!
ద్వేషాగ్ని జ్వలితమైన
ఈర్ష్యాళువు కంటిలో
సానుభూతి కన్నీటి బొట్టుకానరాదుకదా!
ఎర్రని చిక్కనిరక్తంతో
క్షణక్షణం తడిసి పదునుపడి

పైబడి ధగద్ధగ మెరిసే కసాయికత్తికి
పేగుపేగుకలిపే మమతలేదెందుకో!
హింసోన్మత్త క్రూరసింహానికి
పిచ్చెక్కి కరిచే గ్రామసింహానికి
అహింసాదీక్షకాదు తీయనిద్రాక్ష!
పచ్చినెత్తురుత్రాగే జంతువులకేది శిక్ష!
మానవప్రపంచం
పాతకాల పుస్తకం
ఈ నరజాతి చరిత
ఆద్యంతం కాంతాకనకాలపై మమత
దుర్భరమైనశోక ప్రపూరితమైన
ఈప్రాణికోటి కిదొక
నరమేధకుల యజ్ఞవాటిక!
కాదిది జగతికి ప్రజ్ఞపీఠిక!
రక్కసులుచేసే స్వైరవిహారాలకు
పైశాచిక కృత్యాలకు
నిలయమైనదీ జీవితసర్వస్వం
చివరదాకా విషాదాంతనాటకం!
ఇక్కడమమతలు సమతలు
అందనిస్వేచ్ఛాస్వాతంత్ర్యాలు
ఎరుగని సానుభూతి సౌహార్దాలు
అంగడిలో అమ్ముడుపోయే లేమల
ప్రేమకలాపాలు!

అమాయకులైన ప్రజానీకాలకు
జీవితమే అయోమయం
దిగంతాలు నిరామయం
సుఖశాంతులు చీకటివెలుగులు
ఇహపరములు ఎండమావులు
ఒకగుండె ధ్వనిస్తే మరొకగుండెప్రతిధ్వనించు
మనుషుల గుండెలు
కరడుగట్టిన బండలు
గుండెల బండల కొండలు!
ఈ కొండలమధ్యదైనమైట్సు పేల్చినవాడు
నిజంగా దీనబాంధవుడు! వాడే మనవాడు!
వాడుమానవాళికి మాధవుడు!
ఏతల్లి యొడిలోన
ఏవూరి బడిలోన
ఏగుండె గుడిలోన
ముద్దుగా బుద్ధిగా
పెద్దగా ఎదుగుచున్నాడో!
వెళ్ళివెతకండి! వెంటతేరండి!
మన సచివుని...
మన మాధవుని...
మన పార్థుని సారథిని!

8-3-214/29,
శ్రీనివాస కాలనీ, (వెస్ట్)
హైదరాబాదు.

# ఉపద్రవ నిష్కర్ష

-సోమసుందర్

అనతికాలంలో
కలియుగాంతం కాబోతోంది!
కర్తవ్యం మనకింక ఏముంది?
నువ్వూనేనూ ఏం కాబోతున్నామో-
ఉత్తవిధి వంచితులం...
అనివార్య శాపదగ్ధులం...
ఈ ఉపద్రవం ఎలా పరిహరించగలం?
ఈ ప్రమాదం ఎలా అధఃకరించగలం?
సత్యాసత్యాలనడుమ లీలామానుషరూపులం-
ఛాయాదేహులం...
సందేహభావులం...అంటున్నది నైరాశ్యం!
మానవవంశం ఇంతవిస్తరించినా
యుగాంత వేళాధూమ తరంగ
పటలాలపటాలాలకు తలవొగ్గే నిరాశ్రయులం
మహావట వృక్షచ్ఛాయలో కూర్చుని
నామరూపాలు కోల్పోనున్న అనదలం...
గతానేక పురుషాంతర సహస్రాలు
సృజించిన మహనీయుల్ని, ఎత్తినఅమృత
కలశాన్ని
స్మరించుకుందుకైనా ఏదీవ్యవధానం?
ప్రశాంతిఎక్కడ ప్రళయాంతపుసుడిగుండంలో
—అంటున్నది సంశయాత్ముల సిద్ధాంతం,..
మనస్వరూపాలకు త్రాణచిక్కదు
మనఛాయాచిత్రాలకు స్థిరత లభించదు.
ఏ స్వర్గారోహణకో మహాప్రస్థానం!
ఏ నికృష్టనరకానికో ఈడ్చుకు పోబడుతాం!
మనకన్నులుమూసేది వేరిచేతులో తెలియదు.
వత్సా, ఇదిధ్రువం! అంటున్నది వైరాగ్యం.
సంప్రదాయరక్షక స్వాముల
గళవిగళిత నైరాశ్యభావ పరంపర
బోధించే పరమసత్యం యిదేకదా?
కలుషజీవన జాటిల్యాన్ని
పాలకవర్గాల దుర్గ కాఠిన్యాన్ని
పరిష్కరించే సత్పథం ఉందాఏదైనా?
ఏదితమ్ముడూ, క్రొక్కారు తవిరాకుల
కలకలం!
వినిపించు నీగొంతు సారించు...
అరటిమొవ్వ టాకుల్లోకట్టిన
కలలమూట విప్పిచూపించు!
ముళ్ళూ తుప్పలూ, పాములూ జాములూ
లేనిమార్గం ఎక్కడైనా చిక్కుతుందేమో
వెదుకు-
చూపించు; ఆలస్యంచేయకు!
—అంటున్నది వర్తమాన సంశయగాత్రం!
మహాసాగర మధ్యంలో
ఏకస్తంభ దంతగోపుర-
నిర్మించుకుందా మంటావా మేధావీ?

ఉపద్రవ నిష్కర్ష

భూతలదుర్గంధాలనుంచి
ఉన్నతోన్నత ఏకాంతవాసానికి
తరలిపోదామంటావా చెప్పుచెప్పు!
కలియుగాంతాన్ని పరిహరించగలమంటావా?
-అంటున్నది భీతావహ పలాయనత్వం!
సనాతనాచార్యుల గణితం
యుగాంతాన్ని గణిస్తోందికదా, ఏదిదారి
శూన్యంలో పడిమిడికే కలికి
శుష్కశల్యాకృతి కల్పిస్తున్నది కదా
సంప్రదాయం!
పురాతనబిల్లుల శల్యాశకలం
శరమై నిరంతరం సలుపుతోంది గుండెల్లో
యాదవకులానికి ముసలంలా
మానవకులాన్ని తింటోంది సమరభీతి!
కలికలిగా దురాశగా, దుర్మార్గం గా...
-అంటున్నది చింతనా కల్లోలం!
తమ్ముడా ఒకమాటవిను, కవిగుండెల్లో
ఢకారాన్ని కూర్చు, ఆడంబరంగాఅలంకరించు
అంబారీల అంబరాన్ని: విద్యుత్ప్రభా
మండలాన్ని
అప్పుడుతప్పదుసుమీ, మారుతుంది కడలిగా!
పోరాటాలు పోశుత్తే బ్రతుకు కడలిగా...
శాశ్వతంగా పలాయనం చిత్తగిస్తుంది కలి!
-అంటున్నది దార్శనిక చమత్కారం!
పోరాటంయుగసంకేతం
భుక్తికొరకు పోరాటం-రక్తికొరకు పోరాటం
అశన వసనవాసాలకోసం పోరాటం!
శాంతికోసం పోరాటం- కలిని అంతకరించే
పోరాటం!

శ్రమాకవిత దుర్బలతలపై పోరాటం
విప్లవమహాకావ్యంలో పోరాటాలేప్రకరణాలు!
దుష్టకలియుగ అంతంతోపాటు నవయుగ
నిర్మాణం
ఫలప్రదమొనర్చే అంతిమపోరాటం!
నరకజ్వాలా కాలుష్యాల నంతరింపచేసే
కృతయుగ శుభోదయానికి తరింపచేసే
పోరాటం
-అంటున్నది ధీమాగా మార్క్సమహాశయుని
విప్లవకంఠం; నవయుగనిర్మాణ జ్యోతిర్గాత్రం!
మేలుకోతమ్ముడూ, గుండెల్లోకలం
ముంచిరాయి,
నవజీవన శాసనాలను! నిశ్శబ్దాన్ని మీటి
పలికించు కలనాదాన్ని! శబ్దజాలాన్ని సవరించు
సంగీత తరంగంగా, ఉత్తుంగక్రాంతి రంగంగా
దిగంతాల కోనలో సీమల కొనగోళ్ళల్లో
మౌనంగా వ్రేలాడే సుస్వర సంచయాలను
ఆహ్వానించు, కేంద్రీకృత సాంద్రజలౌఘంగా
పరివర్తించు, సకలోద్రేక సంయమితో
త్సాహాలనూ
ప్రసరించుదశదిసలా; దిగంతకాంతులబంధించు!
అంటున్నది ఆశావహజీవన సరిత్ప్రవాహం!
కీచురాయిలా విఘూర్ణించే చీకటి
బదాబదలవుతుంది నీ నినాద గర్జలతో!
గాలికంగాశీగా, మృషావాగ్దానంలా
పిచ్చిపరుగులుతీయడం ముగిస్తుంది!
-అంటున్నది సమైక్యధీ ప్రభామండలం...
అడవిలో ఆకు ఆకునీ పలకరించే
పుడమి జాలిగుండెల కన్నీరు-
ఆశల జలతారు పావడాల సెలయేరు

పూలగుత్తులకు పెదవుల నందిస్తుంది!
రాలిపడిన జీర్ణపత్రాలను
పడవలుగా మారుస్తుంది
విరిగిన రెమ్మల్ని అలుగులుగా కూర్చి
కడలి కెరటాల్ని పొడుపు రేకులుగా
మారుస్తుంది!
వేకువ తీరాలకు తరలిస్తుంది...
వెలుతురు చెరియలపై విడిదు లందిస్తుంది.
—అంటున్నది భరతపక్షిగాత్రం!
పాదపాల పాదాలక్రింద పుడమిఅంత
స్నాయువులు
నిర్భాగ్యపీడితుల ఆక్రోశాలతో ఆర్తనాదాల
వాయువులు
గొంతెత్తి ఏడవడానికిసైతం భయపడ్డ యుగ
యుగాలు
చరాచర జగత్తునంతా ఆనదల పెదవుల
రుసరుసమూలుగులు
కొమ్మలందించే దీనాలాపాలను పత్రాలుచదివి
అద్దరిగట్లకు అందించే నవచేతనస్పందనలు!
-అంటున్నది పల్లవించిన ప్రత్యూషం!
పుడమితొడపై వీణియవలె నిలచినభూజం
ధ్వనితరంగాలు వాయులీనమొనరించే తేజం!
సోయగాల నాలాపించే సౌందర్యం
జీమూతరసికుల శ్రోతృహృదయాలతనియించే
ఔదార్యం!
ఆయత్త మవుతోంది విశ్వాసంతోసరిత్తరంగం!
నిరాశోపహతులపతాకం-కలియుగాంతభయం
కడలినడుగు
కనిపించే తొడిమనడుగు-
యేటినడుగు
కెరటాల పాటనడుగు-
పూలపెదవులపై ఆడేతేటుల ఈలపాటల
నడుగు...
పచ్చనిలోకాన్నంతా అడుగుతమ్ముడూ!
ఆకుపచ్చనిరంగు అబద్ధమాడదు
అదినీరేవటి రూపానికి నేటి సజీవ ప్రతిబింబం!
ఎర్రని మందారాన్ని అవలోకించు; అవనీ
హృదయ
రుధిరసంచలనానికి బాహిర వికాసరూపం!
కలియుగాంతం కల్లలమారికల్పన!
నవయుగకృతాది ఆగమితోత్సాహం
-అంటున్నది శ్రుతులెత్తిన కోకిలగానం...
సాగుసాగరాభిముఖంగా, నగారాధ్వానంగా.
మునుముందుకను ఉషస్సుషమల జీవహేల
అడుగడుగునావిరిసే శిరీషసుమాల కలలతెరల
పన్నీటి మడుగుల్ని తట్టి తట్టిలేపుతూ
నిలుపుతూ
కేలుదోయికలుపుతూ, సాగుసాగరాభి
ముఖంగా!
సనాతనత్వం-తరుకోటర దివాంధం
అదిపలుకదుసుమీ, మంగళాశాసనం!
-అంటూతెల్లని భవిష్యత్తులో లీనమవుతూన్న
వర్తమానం!
ఉపద్రవాలన్నిటినీ నిష్కర్షగా ఖండించేకాలం
మండిత కరవాలం!

కళాకేళి నికేతనం
పిఠాపురం

# షేక్స్పియర్ శేముషీ వైభవం

—పోలాప్రగడ సత్యనారాయణమూర్తి

## లవ్స్ లేబర్స్ లాస్ట్:

"నవర్ రాజైన ఫెర్డినాండ్, అతని సామంత ప్రభువులు ముగ్గురూ. ఒక నిర్ణయం చేసుకుంటారు. అది ఏమిటంటే, మూడు సంవత్సరాల వరకూ వివాహము ప్రేమలవంటి వాటిజోలికి పోకుండా స్త్రీపరాఙ్ముఖులై. నియమ నిబంధనలతో విద్యావ్యాసంగం చేయవలెనని కాని ఫ్రాన్స్‌దేశమునుండి వచ్చిన యువరాణినీ,ఆమెతో వచ్చిన చెలికత్తెలనూ చూసేసరికి, వారి నియమాలన్నీ పటాపంచలవుతాయి. ఆ నలుగురిలో ఒక్కొక్కరు, ఈ నలుగురిలో ఒక్కొక్కర్ని ప్రేమిస్తారు. ప్రతి ఒక్కడు తన ప్రేమసంగతి ప్రక్కవానికి తెలియకుండా రహస్యంగా ఉంచాలని ప్రయత్నిస్తాడు. కాని ఆఖరికి అందరి సంగతీ అందరికీ తెలిసి రహస్యం బట్టబయలవుతుంది. మారువేషాల్లో ఈపురుషపుంగవులు నలుగురూ, తమతమ ప్రియురాళ్ళను సమీపించి వివాహానికి అంగీకరించమని ప్రాధేయపడతారు, వారి బలహీనతలని గమనించి, ఆటపట్టించే ఉద్దేశంతో, ఇంకో సంవత్సరం వరకూ వేచిఉండాలని స్త్రీలు ఆ పురుషులకి ఆంక్షవేస్తారు.". ఇది లవ్స్‌లేబర్స్‌లాస్ట్‌లో ఇతివృత్తం, ఈ నాటకం, షేక్స్పియర్ ప్రమోదాంత నాటకాల్లో ప్రసిద్ధమైన వాటిల్లో ఒకటి, దీనిని ఆయన 1594లోనే వ్రాసినా, ఆ తర్వాత 3,4 పర్యాయాలు అక్కడక్కడ సర్దుబాట్లు చేసినట్లు కనిపిస్తుంది. ''ఈ నాటకంలో, షేక్స్పియర్ రచనలో తరుచుగా కన్పించే నిర్మాణకౌశలం కొరవడింది" అని చారల్‌టన్ అంటే దీని ప్రాముఖ్యం అంతా శైలిలోనే ఉంది అని గ్రాన్ వెవీ బార్కర్ అన్నాడు.' తెలివిగా బ్రతికేవిధానం, సజీవభాషా స్వరూపం 'ఈరెండూ ఈనాటకంచూసినా చదివినా అవగతం అవుతాయి, అంతేకాదు ఇది ఒక విధంగా బెర్నార్డుషా 'పిగ్‌మేలియన్'కి భవ్యకవితా వేశాన్నిచ్చిన నాటకం అని కొందరు విమర్శకులన్నారు.

"చెయ్యితిరిగిన తర్వాత షేక్స్పియర్ వ్రాసిన నాటకమే ఇది. ఇందలి రోషలైన్, బెరోన్‌లు, మచ్ ఎడో ఎబౌట్ నథింగ్‌లో పరిపూర్ణ శక్తియుక్తులతో సాక్షాత్కరించిన బియట్రిస్ బెనిడిక్‌ల తొలిరూపాలు "అని కాల్‌రెడ్జ్ అన్నాడు, ఈ నాటకంలో చమత్కారం, హాస్యం, భావోద్రేకం, వ్యంగ్యం, సమృద్ధిగ ఉన్నాయి. వాల్టర్ రెలీని. అతనితోబాటు బాషాశాస్త్రజ్ఞులనీ, నిరీశ్వర వాదుల్నీ, మూర్ఖాచార పరాయణుల్నీ ఈ నాటకంలో షేక్స్పియర్ అవహేళన చేశాడు. ఇంతవరకు ఆయనరాసిన నాటకాలతో పురుషపాత్రల ప్రాధాన్యత ఎక్కువ. ఈ నాటకంనుంచీ తర్వాత చాలా నాటకాలలో ఆడవారిదే పైచేయిగా కనిపిస్తుంది. లవ్స్‌లేబర్స్ లాస్ట్‌ని 'Nobler Satire and high comedy' అని శ్రీనివాసయ్యంగార్ ప్రస్తుతించారు.

## రోమియోఅండ్ జూలియట్:

మిడ్ సమ్మర్ నైట్స్‌డ్రీమ్‌లో థీసియస్‌వేళాకోళం చేసినట్లు, భావోద్వేగమైన ప్రేమని అవహేళన చెయ్యడం. అది ఒకరకమైన పిచ్చి అనడం, వాస్తవ విరుద్ధము, భ్రమతో నిండిన కలల ప్రపంచము, అని తీసిపారెయ్యడం సులభమే! కాని ఉదాత్తమైన ఆ ప్రేమనే ఎంతో గంభీరంగా చిత్రించి, ఎక్కడా అపహాస్యం పాలుగాకుండా నడపడం, నడిపి, చివరకి

ఉత్తమప్రేమ కావ్యంగారచనని పరిసమాప్తిచెయ్యడం సామాన్యమైన పనికాదు. ఇలా చేస్తే ఎంతో ఘన విజయం సాధించినట్లే అలాంటి ఘనవిజయాన్ని తన భావోద్దీపిత విషాదాంతాలలో (Romantic tragedies) మొదటిది అయిన రోమియో అండ్ జూలియట్‌లో సాధించాడు. షేక్స్పియర్ సాధించాడు కనుకనే విజయసాధనవల్ల వచ్చిన ఆత్మవిశ్వాసంతో అతడు మరల భావోద్వేగమైన ప్రేమని (Pure and intensive love) యాజ్ యులైకిట్, ట్వెల్త్ నైట్, ఏంటొనీ అండ్ క్లియోపాత్రా, వింటర్స్‌టేల్ నాటకాల్లో విజయవంతంగా ప్రవేశపెట్ట గలిగాడు. ఈ నాటకానికి ఆర్థర్‌బ్రూక్స్ పద్యం ఆధారం అని విమర్శకుల అభిప్రాయం. ఆ పద్యంలోని కాలపరిమితిని పూర్తిగ తగ్గించి, కథాగమనానికి ధృతగతిని కలిగించి, మెర్‌కూషియో, నర్సువంటి కొత్తపాత్రలని జేర్చి ఈ నాటకాన్ని షేక్స్పియర్ తీర్చిదిద్దాడు.

వెరోనా నగరంలో మాంటేగ్' కుటుంబానికి 'కేప్‌లెట్' కుటుంబానికీ బద్ధవైరం. ఒక విందులో మాంటేగ్ కుటుంబానికి సంబంధించిన రోమియో, కేప్‌లెట్ కుటుంబానికి చెందిన జూలియట్ కలుసుకుని పరస్పరం ప్రేమించుకుంటారు. ఫైర్‌లారెన్స్ సహాయంతో వారిద్దరూ రహస్యంగా వివాహమాడతారు. ఇలా ఉండగా ఒక వివాదంలో కేప్‌లెట్ కుటుంబానికి చెందిన టైబాల్ట్ అనేవ్యక్తిని రోమియో చంపుతాడు. ఆ నేరానికి దేశబహిష్కృతు డవుతాడు. ఆ రాత్రి జూలియట్‌ని కలుసుకొని, తగిన సమయంలో వెరోనాకి తిరిగిరాగలననీ, జూలియట్ తనూ కలిసి సౌఖ్యమయమైన దాంపత్యజీవితం గడపగలమనీ, వాగ్దానంచేసి రోమియో 'మేంట్యువా' వెళ్ళిపోతాడు. ఇక్కడ జూలియట్‌కి వాళ్ళపెద్దలు 'కౌంట్‌పేరిస్"తో వివాహం స్థిరపరుస్తారు. అది ఇష్టంలేని జూలియట్ ఫ్రయర్ సలహాని అనుసరించి, శరీరాన్ని చైతన్యరహితంచేసే మందు నొకదానిని త్రాగుతుంది.తప్పుగా అందిన కబురుని ఆధారంగా చేసికొని, తిరిగివచ్చిన రోమియో, దారివో పేరిస్‌ని చంపి, జూలియట్ చనిపోయిందని భ్రమించి, తాను విషంత్రాగి చనిపోతాడు. మేల్కొన్న జూలియట్, చనిపోయిన రోమియోని చూసి, కత్తితో పొడుచుకొని చనిపోతుంది. వారి మరణాలతో విరోధి కుటుంబాలు రెండింటికీ వివేకోదయ మౌతుంది.

ఈ నాటకంలో షేక్స్పియర్ చేసిన పాత్రచిత్రణ, శిఖర చుంబితంగా రచించిన ఉదాత్తకవిత, అమోఘాలు. రోమియో జూలియట్‌ల ప్రథమ పరిచయంలోనే జనించినప్రేమ, కొన్నిగంటలలోనే జ్వాజ్వల్యమానంగా పెరిగిపోయి చివరికి ఆరని జ్వాలగా మారి తుదకు వారిరువురినీ దహించివేస్తుంది. రోమియో కంటికి జూలియట్ ఒక వైభవం (Grory)లా కనిపించినదట. ఆమెకళ్ళు దివ్యధీ ధితులను వర్షించే నక్షత్రాలుగా తోచాయి, 'టైటన్'లోని తమోమయమైన విషాదం, ఈ నాటకంలో కాంతిమయం అయింది.

రోమియో జూలియట్ రచనతో, మహోజ్జ్వల విషాదాంతనాటకసృష్టికి నాందిపలికాడు షేక్స్పియర్ అయితే, ఈ విషాదాంతం, అరిస్టోటల్ నిర్వచనానికి కట్టుబడిలేదు. ఇందలి నాయకుడుకాని నాయికకాని నైతికమైన పొరబాటు చెయ్యలేదు. తమ జీవితాల్ని విషాదమయంచేసేబలహీనతలూ వారికిలేవు.వారిజీవితం విషాదమయం కావడానికి (తక్కిన విషాదాంతాలలో వలె) వారు కారకులుకాదు. "మిడిల్‌టన్‌ముర్రే" చెప్పినట్లు, పరిస్థితులు అనే పరశువే ఆలేతమొక్కల్ని నరికివేసింది. "కాల'మే కాలసర్పమై వారి జీవితాలని కాటువేసింది. జె. ఇ. క్రాఫ్ట్స్ వార్విక్ ఎడిషన్‌లో ఇలా అన్నాడు" తొందరపడింది ప్రేమికులుకాదు- వారిప్రేమ, తప్పువాళ్ళిద్దరిదీకాదు- లోకానిది అయ్యో పరిస్థితుల్ని అధిగమినించలేక పోయాడే అని మనలో కరుణరసం జనించేది రోమియోమీదకాదు. అర్థరహితమైన వ్యర్థస్పర్థలు ఆ పసివారిని ఎలా బలిగొన్నాయో

అని ఆ పరిస్థితుల మీద-ఈ కారణాలు కారణంగానే, మన హృదయాలు ద్రవీభూతాలౌతాయి"!

## ఎ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్ :

'టిటానియా' పాత్రని 'ఓవిడ్' గ్రంథం నుండీ థీసియస్‌ని పూర్వగాథల నుండీ రాబిన్ గుడ్‌ఫెలో (పక్)ని రెజినాల్డ్ స్కాట్ నుండీ గ్రహించి, ఛాసర్, స్పెన్సర్, మార్లోల రచనలలోని కొన్ని సంఘటనలనీ కథా చమత్కారములనూ స్వీకరించి, వాటికి తన స్ట్రాట్‌ఫర్డ్ అనుభూతుల్ని జోడించి, తనకు మాత్రమే సాధ్యమైన విశిష్ట సమ్మేళనామార్గంలో కొత్తరచనగా తీర్చిదిద్ది, షేక్స్పియర్ మనకి అందించిన నాటకమే 'ఎ మిడ్ సమ్మర్‌నైట్స్ డ్రీమ్'. ఈ నాటకంలో మనకి కనిపించే ప్రేమికులు చేసే తప్పిదాలూ, ప్రేమ చేసే తమాషాలూ, అనురాగం వల్ల వచ్చే చిత్తచాంచల్యాలూ, బలహీనతలూ అన్నీ "కామెడీ ఆఫ్ ఎర్రర్స్ 'లవ్స్ లేబర్స్ లాస్ట్', 'ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ' వంటి ఇతఃపూర్వపు నాటకాల్లో షేక్స్పియర్ ఇంతక్రితం ప్రవేశపెట్టినవే! అయితే, అవి అన్నీ ఈ నాటకంలో సమపాళ్ళలో కలసి ఏకోన్ముఖానికి వచ్చాయి: షేక్స్పియర్ సృజనాత్మక శక్తీ, వివిధ ఉపాఖ్యానాల్ని ముఖ్యగాథలోకి మేళవించే నైపుణీ, ఈ నాటకంలో ప్రప్రథమంగా గోచరిస్తుంది. ఇందులో పక్ 'god what fools these mortals be!' అన్న వాక్యానికి వ్యాఖ్యానమే ఈ నాటకం. ఈ నాటకంలో కూడా షేక్స్పియర్ "ప్రేమ" ని చాల బలమైన శక్తిగ ప్రదర్శించాడే కాని, దానికి ఒక నిర్దుష్టమైన స్వరూపాన్నీ దృఢమైన జీవశక్తినీ ఇయ్యలేకపోయాడు. అందుకు ఆయనకి ఇంకా కొంత కాలం పట్టింది. ఎడ్మిరల్ సంస్థకి చెందిన ఎడ్వర్డ్ ఎలెన్‌ను ఎగతాళి చెయ్యడానికే ఈ నాటకంలో బాటమ్ పాత్రని షేక్స్పియర్ సృష్టించాడనీ, ఈ పాత్రనీ, కెంపీ, థీసియస్ పాత్రలనీ తనే వేసేవాడనీ విమర్శకుల అభిప్రాయం. కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌లో మనిషిని గాడిదగా మార్చినప్పుడే, షేక్స్పియర్ మనస్సులో ఈనాటకం వ్రాయాలనే ఆలోచన వచ్చి ఉంటుంది.

ఏథెన్స్‌లో హెర్మియా లిజాండర్‌లు ప్రేమించుకుంటారు. కాని హెర్మియా తండ్రికి అది ఇష్టం లేదు. ఏథెన్స్ చట్టం ప్రకారం ఆమె తండ్రికి ఇష్టమైనవ్యక్తినే పెళ్ళి చేసుకోవాలి. ఆ ప్రకారం డెమిట్రియస్‌ని పెళ్ళి చేసుకోవాలనీ, అందుకు ఆమె నాలుగు రోజుల్లో అంగీకారం తెలియపర్చాలనీ ఆ నగరప్రభువైన థీసియస్ ఆజ్ఞాపిస్తాడు. దాంతో హెర్మియా లిజాండరులుఏథెన్స్ నగరం వదిలి సమీపారణ్యానికి పారిపోతారు. అది తెలిసి డెమిట్రియస్, అతనిని ప్రేమించిన హెలెనా కూడా ఆ అరణ్యానికి వస్తారు. అప్పటికి 'ఆబెరాన్' "టిటానియా" అనే కిన్నెర దంపతులు ఒకరిపైఒకరు అలిగి కూర్చుంటారు. పక్ అనే తన కిన్నెర సేవకుని టిటానియా కళ్ళపై మోహం కలిగించే ద్రవాన్ని చిలకరించమని ఆబెరాన్ నియోగిస్తాడు. ఆ ద్రవంలో కొంత భాగాన్ని హెలెనాని తృణీకరిస్తూన్న డెమిట్రియస్ కళ్ళమీద కూడా పిండమంటాడు. ఏథెన్స్ దుస్తుల్లో ఉండడంవల్ల అతడే డెమిట్రియస్ అనుకొని లిజాండర్ కళ్ళమీద పక్ ఆ ద్రవాన్ని చిలకరిస్తాడు ఆ ద్రవప్రభావంతో లిజాండర్ హెలెనాని ప్రేమించడం ప్రారంభిస్తాడు. తన తప్పు తెలుసుకొని తిరిగి ఆ పసరుని డెమిట్రియస్ కళ్ళమీద పక్ చిలకరిస్తాడు అతడు కూడా హెలెనాని ప్రేమించడం మొదలెడతాడు. ఇంతక్రితం ఇద్దరూ హెర్మియాని, ఇప్పుడు హెలెనాని ప్రేమించడంతో, ఆ జంటల మధ్య చికాకు ఏర్పడుతుంది. టిటానియా కళ్ళమీద పిండిన పసరు మరో అపహాస్య సన్నివేశానికి కారణం అవుతుంది. థీసియస్ హిప్పోలిటాల వివాహ సందర్భంలో వేయబోయే నాటకం కోసమని ఒద్దికలు (rehearsal) దిద్దుకొనే ఉద్దేశంతో ఆ అరణ్యానికి వచ్చిన నాటక సంఘంలో బాటమ్ అనే నటుడికి, పక్ కొంటెపనివల్ల సింహం తల బదులుగా గాడిద తల ఏర్పడ్డం, గాడిద తలగల ఆ బాటమ్‌ని చూసి, పసరు ప్రభావం వల్ల

టిటానియా ఆతడిని ప్రేమించడం జరుగుతుంది. తన భార్య గాడిద తలగల బాటమ్‌ని ప్రేమించడం, హెలెనాన్ని ఇద్దరు పురుషులు ప్రేమించడం, ఈ చీకాకుఅంతా గమనించి, మంచుతెర సృష్టించి, అందరినీ నిద్రపుచ్చి అక్కడ లిజాండర్‌ని ఇక్కడ టిటానియాని పసరు ప్రభావం నుండి ఆబెరాన్ విముక్తుల్ని చేస్తాడు. టిటానియా ఆబెరాన్‌లు అలుకలు పోయి ఏకమవుతారు. థీసియస్ హిప్పోలిడాల వివాహంతోపాటు హెర్మియా లిజాండర్ల వివాహం, హెలెనాడెమిట్రియస్‌ల వివాహం జరుగుతాయి.

## భావోద్దీప్త స్వేచ్ఛానాటకం (Romantic Comepy)

పోలియో ప్రతుల్ని పరిశీలిస్తే, 1623 లో ప్రథమతః హెమిన్జ్, కాన్‌డెల్‌లు షేక్స్పియర్ నాటకాలను వేరుపరిచి, వాటిని వేరువేరుగ చారిత్రకాలనీ, ప్రమోదాంతాలనీ, విషాదాంతాలనీ పిలిచారని తెలుస్తుంది. ఆ విభాగం సరి అయినది కాదు. నిజానికి16, 17 శతాబ్దులలో సాహితీవేత్తలకి కాని, విమర్శకులకు కాని, మనవలె ఆయా పేర్లపై ఖచ్చితమైన అభిప్రాయాలు లేవు. ఉదాహరణకి చూద్దాం. రిజిర్డ్ II III లను విషాదాంతాలనీ, టైటస్, కింగ్ విర్‌లని చారిత్రకాలనీ, సింబలీన్‌ని విషాదాంతాలలో కడపటిదనీ పేర్కొన్నారు. ఆ నాటకాలని ఆయా తరగతుల ప్రకారం విభజించడం అసంగతం కదా! కింగ్ లీర్ విషాదాంత నాటకం కాగా, దానిని చారిత్రకం అనడం ఏమిటి? కొరియాలనస్ నాటకాన్ని బెర్నార్డుషా ప్రమోదాంతం అని పిలిచినప్పుడు ఎంత ఆశ్చర్యం వేసిందో ఇలాంటి విభాగం విన్నప్పుడు కూడా అలాంటి ఆశ్చర్యమే కలుగుతుంది. మేక్‌బెల్, లీర్, జూలియస్, సీజర్‌లు చారిత్రకమైన వ్యక్తులే కావచ్చును. కాని షేక్స్పియర్ ఆ నాటకాలని వ్రాసినప్పుడు, వారి రాజకీయ జీవితాలనీ, అందువలన జాతికి వచ్చిన లాభనష్టాలనీ చిత్రించక, వారి వ్యక్తిగత జీవితాలనే తీసికొని వానిచుట్టూవారి మానసిక స్వాభావిక ఉద్రేక ఉపశమనాలనే కళావలిపాల్ని అలంకరించడం వల్ల, అవి విషాదాంత నాటకాలుగా రూపొందాయి. కానిచో అవికూడ చారిత్రక రూపకాలు అయిఉండేవి

ఇలాగే నిశితదృష్టితో పరిశీలిస్తే, సంయోగంతో పూర్తి అయినవన్నీ ప్రమోదాంతాలు కావనీ, వియోగంతో అంతమైనవన్నీ విషాదాంతాలు కావనీ అర్థం అవుతుంది. విషాదాంతాలు అనగానే అన్నీ ఒకే రకమైన విషాదాంతాలు కావు. అలాగే ప్రమోదాంతాలన్నీ ఒకే రకమైనవి కావు. ప్రమోదాంతాలలో పలురకాలున్నాయి.

టేమింగ్ అఫ్ ది ష్రూ, మర్చెంట్ ఆఫ్ వెనీసీలు రెండూ ఒక రకమైన ప్రమోదాంతాలు కావు.

ఇప్పుడు కామెడీ ఆవ్ ఎర్రర్స్, టేమింగ్ ఆవ్ ది ష్రూ, టు జెంటిల్‌మెన్ ఆవ్ వెరోనా, లవ్స్ లేబర్స్ లాస్ట్, ది మిడ్ సమ్మర్‌నైట్స్‌డ్రీమ్, మర్చెంట్ ఆఫ్ వెన్నిస్, ట్వెల్త్‌నైట్, యాజ్ యూ లైకిట్ మొదలైన ప్రమోదాంతా లున్నాయి. అన్నింటిలో ఇతివృత్తం ప్రేమకి సంబంధించిందే! అయితే దానిని ప్రవేశపెట్టిన తీరులో, అందలి పాత్రలలో, వాటిని చూసే ప్రేక్షకులలో, ఆ ప్రేమ గురించి ఏర్పరచుకొనే అభిప్రాయాలలో, ఆయా నాటకాల నిర్మాణ వైఖరిలో, ఎన్నో తేడా లున్నాయి. పైచెప్పినవాటిలో మొదటి రెండూ పూర్తి ప్రహసనాలు. మూడవదాంట్లో ప్రేమికులు మాత్రం భావోద్రిక్తులు. వాతావరణం, సంభాషణలు, రచన, శైలి, వీటిలో మాత్రం భావోద్రిక్తమైన లక్షణాలు కన్పించవు. లవ్స్ లేబర్స్ లాస్ట్ లోకథ నిండుగ నడిచింది. కాని నాటకకర్తకి ప్రేమపై ఇంకా వేళాకోళభావం పోలేదు. అయిదవది అయిన మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీమ్ పూర్తిగ ప్రేమపై వ్యంగ్యధోరణిలో వ్రాసిన నాటకం.

ఈ నాటకాలని ఓ పక్కని పెడితే, తక్కినవి అయిన మర్చెంట్ అఫ్ వెనీస్, ట్వెల్త్‌నైట్, యాజ్ యు లైకిట్, మచ్ ఎడో ఎబౌట్ నథింగ్ మొదలైన

నాలుగైదు ప్రమోదాంతాలు కొన్ని ప్రత్యేక లక్షణాలతో కనిపిస్తాయి.

వీటిలో కూడా ప్రేమే ఇతివృత్తం అయినా,ఇందు వ్యంగ్యానికీ అపహాస్యానికీ తావులేదు. ప్రేమ ఈనాటకాల్లో ఉదాత్తస్థితిని చేరుకుంది. నాటకకర్త కూడా ప్రేమని గంభీరధోరణిలో చిత్రించాడు ఈ నాటకాల్లో. వీటిలో ప్రత్యేకత ఏమిటంటే, ప్రేమకు ఆలంబనమైన నాయికలు నాయకుల కంటే కథలో ప్రముఖపాత్ర వహిస్తారు. మనోవాక్కాయ కర్మలందు ఆదర్శముగ ఉండి, గృహమును స్వర్గసీమగానూ, జీవితమును నందనవనముగానూ మార్చగల ఆయా నాయికల చుట్టూ (ఉ॥ రోసలిండ్, పోర్షియా, బియట్రిస్, వయోలా) సూర్యుని చుట్టూ తిరిగే గ్రహకూటమివలె కథా, కథలో పాత్రలూ తిరుగుతాయి [1] ఆమె వలన నాటకం యావత్తూ దీప్తిమంతం అవుతుంది.

నాటకం అంతా, అపరిమితమైన ఉత్సాహంతోనూ తలమునకలయ్యే సంతోషంతోనూ నిండిన ఒక అపూర్వమైన లోకం. తన భావనాబలంతో నాటకకర్త సృష్టించిన ఆ లోకంలో, కొన్ని అసంబద్ధాలూ కొన్ని అసంగతాలూ మనకిగోచరించవచ్చును. కాని రచయిత సమర్థత, పాత్రలసృష్టిలోనూ సంఘటనల సంపుటీకరణలోనూ ఆయన కన్పరచే నైపుణ్యం, రచనలో కన్పించే భావౌన్నత్యం, అపరిచితమైన పాత్రలని ఆప్యాయమైన వాటిగ అందించడం, ఈ మహా సంరంభంలో, అసంగతాలూ అసంభవాలూ అంతగా పట్టివ్వవు. అసలు వాటిసంగతే ప్రేక్షకుడు పట్టించుకోడు. దానికి తోడు నాటకం మధ్యలో సామాజికునిలో చెలరేగిన ఆవేశాలకీ ఉద్వేగాలకీ విశ్రాంతి నిచ్చే నిమిత్తం హాస్యపాత్రల ప్రవేశం జరుగుతూనే ఉంటుంది. హాస్యపాత్రలూ, వాటి చేష్టలూ సంభాషణలూ వాస్తవ వాతావరణం కల్పించడానికి సహాయపడతాయి. ఈ కథ నిజమేమో అనే భ్రాంతిని సామాజికునికి కలిగించగల నేర్పు షేక్స్పియర్‌కి ఉండనే ఉంది. అందువలన ఇటువంటి నాటకాలలో, వాస్తవికత అనే భ్రాంతిని కలిగించి, భావోన్నత వాస్తవికత (Emotional reality) కారణంగా, నాటకవిజయం సిద్ధిస్తుంది.[2] ఇలాంటి రచనల్లో రచయిత, నిర్ణీతమైన రచనా విధానాన్నీ, నిర్బంధమైన మార్గాన్నీ అనుసరించక నాటక విజయానికి ఏది అవసరమైతే ఆమార్గాన్ని అనుసరిస్తూ నాటక రచన సాగిస్తాడు. ఇట్టి నాటకాలనే ప్రమోదాంతములైన భావోద్దీప్తస్వేచ్ఛా నాటకాలని (Romantic Comedies) సాహితీ విమర్శకులు పేర్కొన్నారు. మర్చెంట్ ఆఫ్ వెనిస్, ట్వెల్త్ నైట్, మచ్ ఎడూ ఎబౌట్ నథింగ్, ఆల్ ఈజ్ వెల్ దటుఎండ్ వెల్‌లు ఈ వర్గానికి కోవకి చెందినవే! వీటిలో మొదటిది మర్చెంట్ ఆఫ్ వెనిస్"—

6, మునిసిపల్ వీధి,
బాపట్ల-522 101.

1 Shakespearian comedy : H. B. Chalton.

2 Vide : Mark Hunter's speech on 22-3-1912 in the meeting of the South Indian Branch of the English Association at MADRAS.

# దేవులపల్లి రామానుజరావు జీవితసాహిత్యాలు

—టి. శ్రీ రంగస్వామి

తెలంగాణములో తెలుగు మాసపత్రికలు లేకుండా పోయిందనే కొరతను తీర్చుటకై 1945 సంవత్సరములో "శోభ" అనే మాసపత్రికను వెలువరించడమే కాకుండా, తెలంగాణములోని రచయిత, రచయిత్రులకు తమ కలాలకు పదును పెట్టి, విజృంభించే అవకాశాన్ని కలిగించిన వారు ఎవరో కాదు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

25-8-1917 సంవత్సరములో ఆండాళమ్మ, చలపతిరావు అను పుణ్యదంపతులకు జన్మించారు (వరంగల్లు) ఓరుగల్లు పట్టణమునందు. ఆండాళమ్మ, చలపతిరావుగారల 9 మంది సంతానములో వీరు మొదటివారు. శ్రీ రామానుజరావుగారు హనుమకొండ ఉన్నత పాఠశాల (కాలేజ్ హైస్కూలు లేక ప్రస్తుత ప్రభుత్వ జూనియర్ కళాశాల) లో మెట్రిక్యులేషన్ చదువుకున్నారు. తాయారమ్మ గారితో పాణిగ్రహణం చేసారు. మద్రాసు విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. పట్టాను పుచ్చుకొన్న తదనంతరము రెండేళ్ళపాటు గ్రంథాలయోద్యమంలోను, మరి రెండేళ్ళపాటు యువజన కాంగ్రెసులోను పాల్గొన్నారు.

ప్రజా సేవకులందరికీ కలిగిన కోరిక, వారిని కూడా న్యాయవాద వృత్తిని చదువడానికి పురికొల్పింది. వంశపారంపర్యముగా ధనవంతులవడముతో నాగపూర్ విశ్వవిద్యాలయము వెళ్ళి ఎల్.ఎల్.బి, పట్టాను పుచ్చుకొని వచ్చారు. న్యాయవాద వృత్తిని స్వీకరించక "ఆంధ్ర భారతి" ఆరాధనకు జీవితాన్ని అంకితము ఒనర్చిన సేవాతపస్వి. ఆంధ్రుల ప్రాక్తన వైభవాన్ని పునః ప్రతిష్ఠ చేయటానికి కంకణము దాల్చిన కర్మయోగి శ్రీ రామానుజరావుగారు.

దేవులపల్లి అని ఉండడము వలన వారు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికి బంధువేమో అని అనుకుంటారు. కాని వారు వైష్ణవ సంప్రదాయమునకు చెందిన మనిషిలాగే కనిపిస్తారు.

మనిషి అంత పొట్టీ కాదు-పొడుగూ కాదు. సుమారైన మనిషి-నవ్వుతూ మాట్లాడిస్తారు. మాటలు స్పష్టంగా ఉంటవి. ఆయనలో హాస్యప్రియత కూడా కలదు. ఆయన సహృదయుడు. ఆయన మాటల్లో హృదయ సంస్కారము కనబడుతుంది.

అంతే కాకుండా ఆయన ప్రాచీనకాలపు పండితుల శ్రేణిలో చేరని నవీనకాలపు పండితుడు అంత మెత్తనివాడూ కాదు, అంత గడసరీ కాదు. మొత్తానికి మెత్తగా ఉన్నట్లు కనిపించినా, స్వీయాభిప్రాయాలను వీడని ధీరచిత్తుడు. ఆయన కార్యవాదిగాని, ఖడ్గవాది మాత్రము కాదు.

తెలుగువారి తియ్య తియ్యని గృహజీవితాన్ని, ఉత్తమ సాంప్రదాయాలను ప్రతిఫలింపజేసే ఇతివృత్తాలను గ్రహించి కవితాగానము చేయును.

రామానుజరావుగారు పెద్దవారి ప్రేరణవలన కాని, అంగడి కొరకు గాని కవిత్వము చెప్పువారు కాదు. మన కాటూరి, పింగళి కవులవలె హృదయం కదలి ఆర్ద్రమైనప్పుడే, అంతరంగం నుండి ప్రేరణ కలిగినప్పుడే కవిత చెప్పుతారు.

దేవులపల్లివారు వట్టి పండితుడే కాదు. ఉత్తమకవి, విమర్శకుడు కూడా, సరళశైలిలో వచనరచనచేయుటలో కూడ సిద్ధహస్తుడు. ఏవిషయాన్నైనా తీసుకొని హృద్యంగా చెప్పగల శక్తివంతుడు. ఉత్తమపత్రికాధిపతి, అలాగే లఘుజీవితచరిత్ర రచనల్లో అందెవేసిన చెయ్యి.

ముఖ్యంగా వరంగల్లులోని నాటి మిత్రమండలి నుండి నేటివరకు ఉన్న ప్రతి సాహితీసంస్థతో ఆయనకు పరిచయముంది, ఆయనను సంప్రదించనిదే పెద్దఎత్తున సాహిత్య కార్యక్రమములు జరుగవనుటలో అతిశయోక్తిలేదు.

"తెలంగాణములేని ఆంధ్రరాష్ట్రము అసమగ్రమని ఆంధ్రజాతి సర్వతోముఖాభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని ఆంధ్రనాయకులు ఏప్రాంతం వారైనను బద్ధకంకణులై కృషిచేసి, ఆంధ్రరాష్ట్రమును సమగ్రముగావించి విశాలాంధ్ర సాధనకు దీక్షవహించవలసియున్నదని"ఆయన ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమయంలో నిక్కచ్చిగ (తెగవేసి) చెప్పారు. దానికోసం అవిరామంగా కృషిచేశారు.

ఆ సమయంలోనే "రామాయణంలో పిడకల వేటలాగ" కేంద్రప్రభుత్వం దృష్టి ఉస్మానియా విశ్వవిద్యాలయంపై పడింది. ఆ విద్యాలయంలో బోధనా భాష ఉరుదూకావడం, అక్కడి పారిభాషిక పదరచనా శాఖ అద్వితీయంగా ఉండటం ఢిల్లీవారినోట నీరూరేటట్లు చేశాయి. పారసీలిపిని దేవనాగరిలిపిగా మార్చి ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా పరకాయం చేయడానికి పూనుకున్నారు. తెలంగాణా,ఆంధ్రలోనే కాకుండా ముఖ్యంగా తెలంగాణంలో ఆందోళన చెలరేగింది. భాషాప్రయుక్త రాష్ట్రాలతో మాతృభాషకు ఏమో ఒరుగుతుందని ఆశిస్తే ఉన్న సంస్థే చేయిజారిపోతున్నదని, ప్రముఖ పౌరులతో ప్రతిఘటన సంఘం ఏర్పడింది. ఈ సంఘమునకు సమావేశకర్త ఎవరోకాదు మన రామానుజ రావుగారే,

రామానుజ రావుగారి చిన్నతనములో 'ఆంధ్ర ప్రచారిణి" సంస్థ వెలువరించిన నవలలు చదివిన తర్వాత వారిలో తెలుగుసాహిత్య పఠనాసక్తి, రచనాసక్తి క్రమంగా పెరిగింది. నాకునేనే తీరికసమయాల్లో నేర్చుకొనినతెలుగే అని అంటారు, కాని వారి "నవ్యకవితా నీరాజనము"ను పరిశీలిస్తే ఒక కవిశేఖరుడు అన్నట్టుగా వీరి పాండితీమహిమ ఇలా ఉంటుంది.

"ఇలుదాటినీవు రావలెగాని
నాపదంబులునమస్కృతులతో మునిగితేలు.

తలపూనినీవుచే కలమందవలెగాని
నిసలైనకవనంబు చెంగలించు"

దీనికి నిదర్శనముగావీరి "పచ్చతోరణము" ఖంచకావ్యమును చూడవచ్చును.

శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు జనధర్మ ప్రత్యేక సంచిక "స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగు కవిత" శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు గారు గౌరవ సంపాదకులుగా వెలువరించిన సంచికలో "స్వాతంత్ర్యానంతర సాహిత్యం" పేర వ్రాసిన వ్యాసమును చూస్తుంటే వారు స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత 23 సంవత్సరముల వరకు ఎలా ఉండేదో వివరించారు. కాని ప్రస్తుతము కూడా మన సాహిత్యం అలాగే ఉందని అనవచ్చును.

మనకు బ్రిటిషు పరిపాలనలో నుండి విముక్తి లభించిన తర్వాత మన దేశములో ఆర్థిక, రాజకీయ రంగాలలోని ప్రగతి మనము సులభంగా గమనించవచ్చును. కాని విదేశీయుల పాలనలో భావ స్వాతంత్ర్యము లేక నలిగిన పౌరుడు, జనులలో వ్యాపించిన ఆశలు, నిరాశలు అయిపోయిన భావము దట్టంగా అగుపడుచున్నది. దానికి తోడుగా ఆకాశాన్నంటే ధరలు, నిరుద్యోగం, అరాచకాలు, అశాంతి, అవినీతి ఎక్కడ పడితే అక్కడ మనకు కనపడుచున్నది. వీటి ప్రభా

వమే రచనా రంగములో కూడా మనకు అగుపడు తుంది. దిగంబర కవులలోని కవిత్వంలో మనకు కొట్ట వచ్చినట్టుగా కనిపిస్తుంది.

"నాకీ మానవలోకం నిర్భరమై తోస్తున్నది
నరమేధం చేయాలని నా మది వాంఛిస్తున్నది
నరకపు నరలోకమెల్ల నరకాలనిపిస్తున్నది
జగతికి మరణపు శిక్షను చెప్పాలనిపిస్తున్నది"

అని అంటూనే—

"అసంపూర్ణమయిన ఈ బ్రతుకులో
ఆనందం అందదని తెలిసి
దానికోస మన్వేషించడం
ఎప్పుడో మానుకున్నాను.
ఇదమిత్థమని నిర్వచించలేని
బ్రతుకునుండి విముక్తికోసం
ఎదురు చూస్తున్నాను"

—అంటూన్న దిగంబర కవులు ఇలా కూడా అన్నా రని చూపెట్టుతున్నారు. వారి "నేను దేవుణ్ణి నమ్ము తున్నాను" అనే గేయంలో

'మానినీ మానసచోరుడు
చిద్విలాసరూపుడు
ఆర్తత్రాణపరాయణుడు
గోపీపీనపయోధరమర్దనుడు
అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడు
మొదలైన చచ్చుపేనుగ కాదు నా దేవుడు

వడిలిపోయిన జీవితాల కుదుళ్లలో ఆత్మీయతను
విదిల్చి
మనిషిని మనిషిగా గుర్తించి—
మనిషిగా బ్రతకడమే నా దేవుడి కిష్టం
ఎవరికీ కాని కుక్కపిల్ల మీంచి కారు నడిచినప్పుడు
మెతుకు కోసం మానాన్ని కాల్చుకొన్నప్పుడు
జాలిపడ్డ గుండెలో నా దేవుడున్నాడు
నా దేవుడూ- చీమూ
నెత్తురూ ఉన్న మానవుడు
మానవత్వాన్ని తప్ప మతాన్ని అంగీకరించడు'

వీటిని చూసిన ఏ వ్యక్తి అయినా శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిలా కవిత్వంలో వస్తున్న అశాంతిని గుర్తించవచ్చును. అలాగేకాకుండా యువకరక్తముల్లో ప్రబలుతున్న అస్థిరతను కూడా గమనించవచ్చును.

ఈ దిగంబర కవితాఉద్యమము హిందీలోని 'నయీ కవితా' ఉద్యమమును పోలిందేనని అంటారు. ఈదిగం బరకవులు నవజీవన విధానమును రూపొందించవలె నని ఆశయముతో ఉన్నారు. అయితే వారికి ఏ ఒక రాజకీయ మతముతో సంబంధము లేనట్టుగా అగుపడు తుంది వారి దిగంబర శకమును పరిశీలిస్తే, మూఢ నమ్మకాలను, చాదస్తాలను వీరు ఎదిరించారు. ఈ ఎది రింపు (బెదిరింపు) లో ఉద్రేకం ఎక్కువగా చోటు చేసుకుంది. అశ్లీలమును తమకవితలో ఉప యోగించుటకు కూడా వారు వెనుకంజవేయలేదు. అయితే ఈ మార్పు ఇతర భాషలలోకూడా అగుపడు తుంది. స్వాతంత్ర్యము వచ్చిన కొత్తధోరిణి, మార్పు, మన సమాజంలో వచ్చిన అవాంఛనీయ పరిణామాల ఫలితమే ఈ సాహిత్యధోరిణి అని అంటారు శ్రీ రామా నుజరావుగారు.

అలాగే స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత తెలుగులో అభివృద్ధిచెందిన సాహిత్యం వచనకవిత్వం. వచన కవి త్వంలో ఉత్తమరచనలు వచ్చినవి. వచనకవులు అగ్రశ్రేణిలో నిలిచారు. నారాయణబాబు తిలక్, అజంతా, కృష్ణశాస్త్రి! సోమసుందర్, సంపత్కుమార్, ఆరుద్ర మరియు శ్రీశ్రీలను ఈ సందర్భములో చెప్ప కోవచ్చును. తెలుగు వాఙ్మయమందు యీ రచనలు మిక్కిలి విలువగలవి అనుటకు "ఫ్యూడల్ యుగం పోయి ప్రజాస్వామ్య యుగంరావడానికి అభ్యుదయ సాహిత్యం తోడ్పడింది" శ్రీశ్రీ అనిన మాటలుఎంతో దగ్గరగా ఉన్నాయి.

కవితా ప్రక్రియను వదిలిపెడితే నవలలు, కథలు పుంఖానుపుంఖముగా వచ్చినప్పటికిని వీటిల్లో సమకాలీన జీవితం, దానికి సంబంధించిన సమస్యలు, ఇతివృత్తములు, శైలి, మనలో వచ్చినమార్పులను స్పష్టముగా చూడవచ్చును. ఈకాలములోనే హిందీ, వంగ భాషలలోనుండి శరత్, ప్రేమచంద్, రవీంద్రనాథ్ ఠాకూర్, కిషన్‌చందర్ మరియు జైనేంద్రసింగ్ ప్రభృతులవి అనేకము తెలుగు భాషలోకి అనువాదములుగా వచ్చినవి.

స్త్రీరచయితలు కూడా స్వాతంత్ర్యము అనంతరం ముందుకు వచ్చిన పురుషులతో సమానముగా ఎన్నో రచనలు చేసారు. ఎంతోమందిస్త్రీలు మనకు చక్కని సాహిత్యమును అందించారు. స్త్రీలు ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబాల పరిస్థితులు-సమస్యలు ఇతి వృత్తాలుగా తీసుకొని రచనలు చేసారు. ఈశతాబ్దపు రచనలు ముఖ్యముగా స్వాతంత్ర్యానంతర రచనలు కళా దృష్టితో విలువకట్టవలసి వచ్చినచో కథానికకు ప్రథమ తాంబూలము ఈయవలెనని అంటూనే తెలుగు కథానికలకు భారతీయ సాహిత్యంలో గౌరవస్థానమున్నది. అని అంటారు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు.

స్వతంత్ర భారత దేశములోనున్న దేశభాషలలో దేశీయ-విజాతీయ ప్రభావం గోచరించినప్పటికిని భారతీయ సంస్కృతియొక్క ముద్ర ఇతర సాహిత్యాలతో పాటు తెలుగు సాహిత్యము మీద స్పష్టముగా కనిపిస్తుంది.

శ్రీ రామానుజరావుగారి 'స్వాతంత్ర్యానంతర సాహిత్యము" చదివినపుడు మనకు వారిలోని అవగాహన సాహిత్య తత్వదర్శనము, జాతీయతాభావము స్పష్టముగా గోచరిస్తుంది, వచన కవిత్వముపై సమగ్రంగా కాని!వారు ఎంచుకున్న కోణమునుండి పరిశీలించుకొన్న వారికి ఈవ్యాసము ఎంతగానో ఉపకరిస్తుంది. ఆయన మనకు కనపడని గంభీరుడు, ఆయనను సాహిత్యపరముగా కదిలిస్తే చాలు మనకు ఎన్నో విషయాలు సోదాహరణముగా చెప్పగల ధీశాలి. అయన మస్తిష్కంలో సాహిత్యము సంద్రంలా పేరుకొనిపోయింది అనుటలో అతిశయోక్తిలేదు.

ఉపయోగింపబడిన గ్రంథములు
1) జనధర్మ ప్రత్యేకసంచిక
2) మనరామానుజరావుగారు
3) మరపురానిమనుషులు
తిరుమల రామచంద్ర
4) పచ్చతోరణం-ఖండకావ్యము.

5-11-114/5
విద్యారణ్యపురి
వరంగల్లు
506 009

# ప్రాణదాత

-పైడిపాటి సుబ్బరామశాస్త్రి

డాక్టరు మూర్తి విజయవాడలో సుప్రసిద్ధవైద్యుడు పచ్చగా పొట్టిగా ఉండేవాడు. ఎప్పుడు చిరునవ్వు ఆయన ముఖంమీద తాండవం ఆడుతుండేది. రోగులకు ఆయనను చూస్తేనే సగం రోగం తగ్గిపోయేది. ఆయన కున్న ప్రాక్టీసు వైద్యంలో పెద్దచదువు చదివినవాళ్ళకే ఉండేది కాదు. ఆస్పత్రి ముందర జనం ఎప్పుడూ కిట కిటలాడుతూ ఉండేవారు. ఆయన వైద్యం కోసం పొరుగూరు వాళ్ళు కూడ బళ్ళు కట్టించుకు వచ్చే వారు.

చూడగానే వ్యాధిని కనిపెట్టగలగడం ఆయనకున్న మహాశక్తి. సరదాగా మాట్లాడుతూ రోగిని చూడడం చేత ఆయన సరిగా రోగిని చూచినట్లు ఇతరులకు కన బడేది కాదు. ఆయన చేసిన రోగనిర్ణయం ఢిల్లీ వెళ్ళినా తిరుగు లేనిది. సాధారణంగా ఆయన నయం చేయ లేని కేసులు ఉండేవి కావు. కేసు చివరి భాగంలో తన దగ్గరకు వచ్చి, అది పట్టినా ప్రయోజనం లేదని తోస్తే రోగి బంధువులకు ఆ విషయం రహస్యంగా ముందే చెప్పేసేవాడు కాని, ఫీజు కోసం కేసు పట్టేవాడుకాదు. వాళ్ళు ఆయననే ఏదో మందు ఇమ్మంటే వారి కోరిక కాదనలేక ఉపశమనానికి తగిన మందు ఇచ్చేవాడు. రోగి ఇన్నాళ్ళలో పరలోకానికి టిక్కెట్టు పుచ్చుకుంటా డని చెబితే అలాగే జరిగేది. ఆప్తులయినవాళ్ళు చెప్ప మని కోరినపుడు కుండబ్రద్దలు కొట్టినట్లు అలా చెప్పేసేవాడు. చెప్పమని కోరినవాళ్ళు కూడ ఆయన నిజం చెబితే కొందరు బాధ పడేవాళ్ళు గాని, ఆయన దానిని లెక్కించేవాడు కాదు.

వాళ్ళు ఊరు కదలించి ఏ హైదరాబాదో, చెన్న పట్నమో తీసుకువెళ్ళినా ఫలితం ఆయన చెప్పినట్టే జరిగేది. కొన్ని కేసులు నెగ్గుతవా, లేదా అనేసందేహం కలిగితే వారి జాతకాలు చూచి ఒక అభిప్రాయానికి వచ్చేవాడు. తాను అల్లోపతి వైద్యుడే అయినా ఆ వైద్యంలో ఉపశమనమే తప్ప, నయంకావటంకష్టమనీ తాననుకున్న కేసులుంటే వాటిని ఆయుర్వేద వైద్యుల దగ్గరకు గాని, హోమియోపతి వైద్యుల దగ్గరకు గాని పంపించివేసేవాడు. కొందరు జబ్బు ఉన్నట్టుగా ఇమ్మని సర్టిఫికెట్ కోసం వచ్చేవారు. పరీక్షచేసి జబ్బు ఉంటేనే సర్టిఫికెట్ ఇచ్చేవాడు. ఎవరయినా ప్రావి డెంటు ఫండ్ మీద అప్పు తీసుకోవడానికి సర్టిఫికెట్ కోసం వస్తే వారి భార్యకూడ వచ్చి, అది తన సుస్తీ కోసం చేయబడే అప్పే అని ధృవీకరిస్తే తప్ప సర్టి ఫికేట్ ఇచ్చేవాడు కాదు. నిజాయితీ గల డాక్టరుగా ఆయన పేరు సంపాదించాడు. అన్యాయపు కేసులు పట్టనివారిని 'మడిప్లీడరు' అని ఎలా అంటారో ఆయన మడిడాక్టరని కొంద రనేవారు.

ఆయనను మడిడాక్టరనడానికి ఇంకొక కారణం కూడ ఉన్నది. తాను మందులషాపు పెడితే తన కొట్టులో ఉన్న మందులు వ్రాసి యిచ్చే ప్రలోభం కలుగుతుందని దానివల్ల రోగులకు న్యాయం జరుగ దనీ, ఎంతో లాభం వచ్చే మందులషాపు పెట్టడం మానివేశాడు.

వైద్యం చేయడమే ఆయన పద్ధతి కాని, మనిషి ముఖం చూచి వైద్యం చేసే పద్ధతి కాదు. ఆస్పత్రిలో ఆయనకు భాగ్యవంతుడూ, నిరుపేదా ఒకటే. ఫీజు నిర్ణయించుకోవడమనేది ఆయన నిఘంటువులో లేదు. అలా నిర్ణయించుకోవడం తప్పని కూడ ఆయన అభి

ప్రాయం అసలు వైద్యవృత్తి లోనే కొంత పాపం అంటే స్వభావం ఉన్నదనీ, వైద్యుడు ఒకవేళ పొరబడకపోయినా ఆయనకు వచ్చే మందు తయారీలోపం వల్ల కూడ రోగి నష్టపడవచ్చుననీ, ఫీజు నిర్ణయించుకోవడం ఒక కాంట్రాక్టు అని, అది సకామకర్మ అవుతుందనీ, డబ్బు కాశపడని వైద్యం నిష్కామకర్మ వంటి దవుతుంది కనుక దానివల్ల వచ్చేపాపం వైద్యుణ్ణి అంటదనీ ఆయన విశ్వాసం సంపన్నులయిన వాళ్ళు వాళ్ళకు తగ్గట్టుగానూ, పేదవాళ్ళు వాళ్ళకు తగ్గట్టుగానో ఫీజు లిచ్చేవారు. వాళ్ళు ఎంతఇచ్చిందీ లెక్కించుకోవటం ఆయనకు అలవాటు లేదు అలా లెక్క పెట్ట కూడదనికూడా ఆయన అభిప్రాయం. అలా లెక్కిస్తే ఇంత భాగ్యవంతుడు మనకు తక్కువ డబ్బిచ్చాడే అనే సంతృప్తి కలుగుతుందనీ, దానివల్ల ఆ మనిషిని చూసినపుడు హృదయపూర్వకంగా మాట్లాడటానికిఆది ప్రతిబంధక మవుతుందని, ఆయన నమ్మకం. పేదవాడు సహజంగా తక్కువే ఇస్తాడు ఇంత పెద్దవ్యాధి నయం చేశాను కనుక వాడు ఎక్కడయినా అప్పు చేశయినా ఎక్కువ సొమ్ము ఇవ్వకూడదా అనే అభిప్రాయం కలుగుతుందనీ, ఆ అసంతృప్తి కూడకలుగ కూడదనీ ఆయన ఉద్దేశం "సంతోషి కాదేని శత్రుడైన నశించు" కనుక నిత్యసంతుష్టుడుగా ఉండాలని ఆయన నమ్మకం ·అందుచేత వచ్చిన డబ్బును జేబులో కుక్కుకోవడమే తప్ప లెక్కించుకోవడం అనేది లేదు. ఖరీదుగల మందులు వ్రాసి యివ్వకుండా, చవక మందులు ఎన్నికచేసి వ్యాధులు నివారించడం ఆయనలోని ప్రత్యేకత. తప్పనిసరి అయితే తప్ప సూది వైద్యం కాని, గొట్టాల మందులు కాని, వాడడం లేదు. ఆయన చీట్లు వ్రాసినది వ్రాసినట్లుగానే ఉండేవారు. జనం ఎంత ప్రవాహంగా వచ్చినా, చకచకా అయన పని చేస్తూనే ఉండేవాడు. ఆయన దస్తూరీ పరిశీలించాలంటే ఇతరులకు అంతు చిక్కేది కాదు.

కంపౌండర్లకే తెలిసేది అనుభవం మీద- ఎందు చేతనంటే అంత వేగంగా వ్రాసేవాడు కనుక. ప్రత్యేకంగా 'క్యూ' పద్ధతి ఆస్పత్రిలో లేకపోయినా, ఎవరు ముందు వచ్చారో, ఎవరు వెనుక వచ్చారో ఆయనకు గుర్తుండేది కాని, వచ్చిన జనంలో ఎంతమంది వైద్యానికి ఫీజు ఇచ్చారో ఎంతమంది ఇవ్వలేదో జ్ఞాపకము దేదీ కాదు 'మహాప్రభో! మీరు ప్రాణదాతలు, నా భార్యను బ్రతికించారు' అని ఒకడు నొరకాయ, మరొకడు గుమ్మడికాయ, ఇంకొకడు పంపర పనస, మరొకడు నేతిడబ్బా తీసుకువచ్చి ఇచ్చేవారు. ఆయన పుచ్చుకునేవాడు — అంతే. అందుచేత ఆయనకు 'ధర్మరాజు' అనే పేరు వచ్చింది. ఇంటినుండి బయలుదేరితే చెయ్యెత్తి నమస్కరించేవారూ, కాళ్ళ మీద పడేవారూ కోకొల్లలు. "ఇలా ఉంటే డబ్బెలా వస్తుంది?" అని ఎవరయినా అంటే, 'రానిది రాదు- పోనిది పోదు" అని త్యాగరాజుగా రన్నారని సమాధానం చెప్పేవాడు. ఇంకా ఇలా అనేవాడు- 'పూర్వజన్మ కృతం పాపం వ్యాధిరూపేణ పేజితః-' కాబట్టి రోగం రావడానికి పూర్వజన్మ పాపం కారణం కదా! దానిని పోగొట్టుకోవాలంటే దేవతారాధన, దానం, జపం ఇవన్నీ చేస్తూ ఔషధం కూడ పుచ్చుకోవాలి. ఇప్పటివాళ్ళు కేవలం మందువల్లనే నయంఅవుతుందని వస్తున్నారు. వాళ్ళను పీడించడం నా కిష్టంలేదు. వాళ్ళు బుద్ధిపూర్వకంగా ఇచ్చిన డబ్బువల్ల వాళ్ళ పాపం మన కంటదు

ఆపరేషన్లకు మాత్రం కొన్ని నిర్ణయింపబడిన చార్జీలు ఉండేవి లాంఛనంగా. అవి అందరికీ అందు బాటులోనే ఉండేవి. ఒకమాటు ఒక సంపన్నుడుతాను పేదవాడినని చెప్పి తనవాళ్ళకు ఆపరేషన్ చేయించుకున్నాడు. "నీ శక్తి అంత అయితే అంతే యివ్వు" అన్నాడు డాక్టర్. అతడు సంపన్నుడని డాక్టరుకు తెలుసు. అతడు పొరుగూరి వాడయినా, ఎవరో ప్రక్కవారు చెప్పారు కూడా. "పోనీవయ్యా! అంత దారిద్ర్యాన్ని ఆయన కావాలని తెచ్చుకుంటూ దరిద్రుడను మొర్రో అని ఏడుస్తుంటే పోనీ" అన్నాడు. అంతే— వాడికి దారిద్ర్యం పట్టిందని వాడే కొన్నాళ్ళకు వచ్చి

చెప్పి చెంపలు వేసుకుని, బుద్ధిపూర్వకంగా రెట్టింపు సొమ్ము ఇచ్చి వెళ్ళాడు. ఇది జ్ఞాపకం వచ్చినప్పుడల్లా డాక్టరుకు నవ్వు వచ్చేది. ఆయన చేసే ఆపరేషనులు శాస్త్రీయంగా ఉన్నవా- అని కొందరు సందేహం వెలి బుచ్చేవారు, కానీ ఆయనవి విజయవంత మయినట్లుగా మిగతావాళ్ళవయ్యేవి కావు. ఏమయినా ఆయన హస్త వాసి గొప్పదని అందరూ అంగీకరించేవారు. ధన వంతులు కొందరు పేదవాళ్ళ కంటే ముందు తమ్ము చూడవలసినదిగా ముఖమాట పెట్టేవారు "ఆయన నవ్వుతూనే మీరు మరియొక ఆస్పత్రికి వెళ్ళవచ్చునని" సమాధానం చెప్పేవాడు. వారు వెళ్ళేవారు కారు మరీ పేదలయిన వారికి, తనకు మందుల కంపెనీ వారు ఉచితంగా ఇచ్చిన 'శాంపిల్స్'ఇచ్చివేసేవాడు. ఆయన వైద్యవృత్తి 'బెట్టు' పోగొట్టుకుంటుందని కొందరను కునేవారు. వైద్యుడంటే ఇల్లాగే ఉండాలని కొందరను కునేవారు.

ఆయన దినచర్య ఒక ప్రత్యేక పద్ధతిలో ఉండేది. తెల్లవారకట్ట నాలుగు గంటలకు విష్ణుస్మరణంతో నిద్ర లేచేవాడు. చన్నీళ్ళ స్నానం చేసి విభూతి రేఖల తీర్చి అనుష్ఠానానికి కూర్చునేవాడు ఆరు గంటల కల్లా అను ష్ఠానం పూర్తిఅయ్యేది. భార్య 'చంద్రమతి' ఆయనతో పాటే లేచి, ఆయన కోసం ప్రత్యేకంగా వంట చేసేది 'బాలభోగం తయారయింది' అని ఆమె నవ్వుతూ అన గానే 'సిద్ధం' అని వచ్చి భోజనం చేసేవాడు. ఏడు గంటలయ్యే సరికి, అయన పడక కుర్చీలో విశ్రమిస్తే భార్య పచ్చ కర్పూరం, కుంకుమపువ్వు మొదలయిన ద్రవ్యాలతో మిశితమైన తాంబూలాన్ని అందిచ్చేది. దానిని సిద్ధమకరధ్వజపు మాత్రతో సేవిస్తూ, ఒక అరగంట విశ్రమిస్తూనే వార్తాపత్రికను చూసేవాడు. ఒక అరగంట పిల్లలతో కాలక్షేపం చేసి ఎనిమిది గంటలకు గుఱ్ఱపుబండిలో ఊళ్ళో కేసులను చూడడా నికి బయలుదేరేవాడు. మూర్తిగారి గుఱ్ఱపుబండి అంటే అందరికీ గుర్తే. కార్లు కూడ తప్పుకుపోయేవి. రెండు గంటలలో ముఖ్యమైన కేసులన్నీ చూసుకొని, పది గంటలకు ఆస్పత్రికి చేరేవాడు చీట్లు వ్రాసే పని పన్నెండు గంటలకు పూర్తి చేసుకుని ఆపరేషన్ కేసు లను గంటలో పూర్తి చేసుకునేవాడు. ఒంటిగంటకు ఇంటికి వచ్చి ఉష్ణోదక స్నానం చేసి, ఒక గంట విశ్ర మించేవాడు. అది నిద్రకాని నిద్ర ఆ సమయంలో ఎవరూ ఆయనను నిద్రలేపేవారు కారు. రెండు గంట లకు లేచి రోగులు బుట్టలతో పంపిన పళ్ళతో తన కిష్టమైనవి భుజించేవాడు. ఒక్కొక్కప్పుడు దోసకాయ ముక్కలే ఫలహారం చేసేవాడు. ఆయనకు కాఫీ అల వాటు లేదు. పైగా కాఫీ తాగేవాళ్ళను చూస్తే కోపం కూడా! దానికి బదులు కుంకుడురసం త్రాగకూడదా? అనేవాడు ఆస్పత్రిలో చేతులు కడుక్కోవడానికి సబ్బును వాడినా ఇంట్లో షీకాయపొడినే వాడేవాడు. బుధవారం, శనివారం క్షౌరమంగలి చేత అభ్యంగనం చేయించుకునేవాడు.

మధ్యాహ్నం రెండుగంటలు దాటిన తర్వాత పొరి గూరి కేసులేవయినా ఉంటేవారు కారు పంపితే వెళ్ళే వాడు. ఏ విధంగా అయినా నాలుగు కొట్టేసరికి తన ఆస్పత్రిలో తాను ఉండవలసినదే. ఆపరేషన్ కేసు లొకసారి చూసుకొని, తిరిగి రోగులకు మందుల చీట్లు వ్రాసేవాడు. అయిదున్నర గంటలకు పని ముగించు కొని, ఒక అరగంటసేపు వచ్చిన స్నేహితులతోగాని బంధువులతో గాని పిచ్చాపాటీ మాట్లాడేవాడు. తర్వాత ఇంటికి చేరి తిరిగి స్నానం, సంధ్య ముగించుకొని ఊళ్ళో పురాణ కాలక్షేపమునకు గాని, సినిమాకు గాని వెళ్ళేవాడు. ఇంటికి వచ్చి భోజనం చేసి గోక్షీరం తీసు కున్న తర్వాత జేబులో కుక్కుకున్న డబ్బును బయ టకు తీసి లెక్కపెట్టుకుని ఇంటిఖర్చుకు కావల్సింది దిచ్చి మిగిలినది బాంకుకు పంపే ఏర్పాటు చేసేవాడు. ఆయన ఎప్పుడూ ఖద్దరే ధరించేవాడు. జాతీయోద్యమంలో లాఠీదెబ్బలు తిన్నవాళ్ళందరికి వైద్య సహాయం చేశాడు. ఆయన శ్రీకృష్ణజన్మస్థానానికి వెడదామను

కుంటే పెద్దలు ఇదే జైలుకు వెళ్ళడం కంటె మించిన దేశసేవ అని ఆయనను వెళ్ళకుండా చేశారు.

ఆయన హితం కోరిన కొందరు 'డాక్టరుగారు! మన విజయవాడలో కాస్త దూరంలో పొలాలు ప్లాట్లు వేసి అమ్ముతున్నారు. గజం పావలా గిట్టుతుంది. తరువాత దానిని అమ్ముకుంటే గజం పదిరూపాయలుదాకా రావచ్చు. అందరూ కొంటున్నారు. మీరు కూడ కొనండి" అని సలహా చెప్పేవారు. "నేనేదో వృత్తిలో ఉన్నాను! అదే నాకు తపస్సు. పరమేశ్వరుడు నాకెంత ఇవ్వదలిచాడో అంతా ఆ వృత్తిలోనే ఇస్తాడు ఆశకు అంతమనేది లేదు. మీరు చెప్పేది వ్యాపార పద్ధతి. నా వృత్తి నాకుండగా మరొక వ్యాపారం నాకు దేనికి? అనేవాడు. "అదేమిటండీ! ఈజీమనీ" మీరు పెట్టుబడి పెట్టగలవారు. ఒక్కమాటులో లక్షాధికారి అయిపోవచ్చు' అనివాళ్ళు అనేవారు. నాకు ఈజీమనీ మీద నమ్మకం లేదు. కష్టించి ఆర్జించిన దానిమీదే నమ్మకం. రేపు పట్టణ ఆస్తుల మీద గవర్నమెంటు గరిష్ఠ పరిమితి విధించిన దనుకోండి. అప్పుడు మన ఆశకు భంగం కలగడమే కదా! సుఖాన ఉండే ప్రాణాన్ని కష్టాన ఎందుకు పెట్టుకోవాలి? ఇలా వ్యాపారం చేయడం మొదలుపెడితే, రేపు ఒక సినిమాలో పెట్టుబడి పెట్టాలనిపించవచ్చు. ఆ కంపెనీ దివాలా తీయవచ్చు. ఎందుకు నాకీ జూదం? అనేవాడు 'మరి మీ అబ్బాయిలకు తలకొక లక్ష ఇచ్చి పోవద్దుటండీ అని అంటే, 'నా కెవరిచ్చారు లక్ష! నా డ్యూటీ, వాళ్ళకు మంచి చదువు చెప్పించడం, మంచి అలవాట్లలో పెట్టడం, వాళ్ళ జాతకాల ప్రకారం వాళ్ళకు జరుగుతాయి. ఆవులు పోతూపోతూ లేగలకు మేతపెట్టి పోతున్నాయా? అనేవాడు. మీరు వేదాంతులండీ, పట్టి మడిడాక్టరనుకున్నాం' అంటే నవ్వి 'చీమలు పెట్టిన పుట్టలు, పాముల కిరవైన యట్లు, పామరుడు తగన్ హేమంబు కూడబెట్టిన భూమీశుల పాలుజేరు పొందుగ సుమతీ!' అనేవాడు. "అయితే మీది సోషలిజం వేదాంతమన్న మాట" అని నవ్వేవారు

విజయవాడకు దగ్గర గ్రామమయిన "పోరంకి" నుండి ఒకరు మూర్తికి చిన్నకారు పంపించారు- అర్జంటు కేసని మూర్తి బయలుదేరారు. ఆ ఇంటివారెప్పుడూ తన దగ్గరకు వచ్చినవారు కారు. వాళ్లకు మామూలుగా అలవాటయిన డాక్టరు ఆ ఊరినుండి తిరిగివస్తూ ఎదురుపడ్డాడు. ఒకళ్ళ నౌకరు పలకరించుకుంటూ ఉంటే, ప్రస్తావనలో ఆ డాక్టరు తానా కేసు దగ్గర కెళ్ళి వస్తున్నాననీ, నాడి అందడం లేదని 'హార్టు ఫేల్యూరు' కావచ్చుననీ, తాను చేయగలిగింది లేదని చెప్పి వచ్చేస్తున్నానని చెప్పి వెళ్ళిపోయాడు. "అయితే నేనెందుకయ్యా!" అన్నాడు మూర్తి తనను తీసుకువెళ్ళే చుట్టానితో; ఆ వచ్చినవాడు ఆ రోగి తమ్ముడు. రోగి పెద్ద భూస్వామి. లక్షాధికారి. ఆ తమ్ముడు ఒక్కమాటు చూస్తేతప్ప వీలులేదని బతిమాలాడు. "సరే- కారు పోనీ! నేను మాత్రం చేయగలిగింది ఏమయినాఉంటుందని అనుకోను"అన్నాడు. రోగిని చూశాడు. నాడి అందడం లేదు. కానీ మనిషి బతికే ఉన్నాడనే స్ఫురణకలిగి, నిశ్చయించుకున్నాడు రోగి పొలం నుండి రాగానే గుండె పట్టుకుంటూ కళ్ళు తిరిగి పడిపోయాడండీ— అని యింట్లోవాళ్లచెప్పారు. చుట్టూ ఊళ్లో జనం మూగిఉన్నారు. "మీరు ప్రాణదాతలండీ ఎన్నో ప్రాణాలు రక్షించారు. ఈప్రాణాన్ని కూడ రక్షించండి" అని పెళ్ళాం ఆపురుమంది. 'ఊరుకోవమ్మా నేను ప్రాణదాత నేమిటి? వాళ్ల ఆయుర్దాయం ఉండి వాళ్ళు బతికారు. నేనేమయినా దేవుణ్ణా' అని కసిరాడు. "పడిపోయినపుడు నోటినుండినురుగు వచ్చిందా?" అని అడిగాడు. "వచ్చింది" అన్నది. పాదాల దగ్గరనుండి పైకి చూసి, జానెడుపైన ఉన్న మట్టిపెళ్ళికను ఊడదీశాడు. నీళ్ళు పట్టుకురమ్మని ఆ ప్రదేశాన్ని కడిగాడు. దానిక్రింద గాట్లు కనిపించినై. 'ఇది పాముకాటు' అని నిశ్చయం చేశాడు. అందరూ తెల్లబోయారు.

అప్పుడు జనంలో నుండి ఒకడు వచ్చి వేపమండ తెమ్మన్నాడు ఇంట్లోనే ఉన్న వేపచెట్టెక్కి ఒకడు విరుచుకువచ్చాడు. వాడు మంత్రం వేయడం ప్రారంభించాడు డాక్టరు మూర్తి చూస్తూ కూర్చున్నాడు. పది నిమిషాలయింది. ఏమీ జవాబు లేదు. వాడు పాములవాడు. గొప్ప మంత్రగాడే. మళ్ళీ వేస్తూనే ఉన్నాడు. డాక్టరు కోపం తెచ్చుకున్నాడు. "ఏమిటా ఏడుపు! సరిగా మంత్రం వేయడం చేతకాదు. ప్రతివాడు బయలుదేరుతాడు.' "పెద్దదొరలు అల్లా అన కూడదు. నేను గొప్ప మంత్రకాణ్ణి. కాని చేయి మిగిలిపోయిన తర్వాత వచ్చిన కేసు" అన్నాడు 'ఎల్లాంటిదయితే ఏం? మంత్రం మంత్రమే. ఈ పాటికి జవాబివ్వవద్దూ?' అన్నాడు. వాడు వేస్తూనే ఉన్నాడు. "ఏమిటా ఏడుపు!" అనివాడిని ప్రతిక్షణం రెచ్చకొట్టప్రారంభించాడు. వాడికి మండింది. 'నాకు చేతకాదంటారు, మీకు చేతనయితే మీరు మిడకండి' అన్నాడు మాట వరుసగా. డాక్టరుకు కావల్సింది ఆ మాటే. "ఇక నువ్వు తప్పుకో" అన్నాడు. జనాన్నందరినీ అక్కడ నుండి వెళ్ళిపొమ్మన్నాడు. అందరూ ఆవరణ దాటి వెళ్ళిపోయి దూరాన అక్కడక్కడ నక్కి ఉన్నారు డాక్టరు ఏమి చేస్తాడో చూద్దామని మూర్తి ఆకాశం వంక ఒకమారు చూసి నమస్కారం చేశాడు. ప్రక్కనున్న గరిక తీసుకుని ఒక్కమారు మంత్రం వేసి కూర్చుని రోగి దగ్గరనుండి బంధువులను కూడ వెళ్ళిపొమ్మన్నాడు, సర్పం దొడ్లో గోడమీదుగా పది నిమిషాల్లో వచ్చింది. "కానీ" అన్నాడు. కాటువేసిన చోటునుండి శరీరం అంతా వ్యాపించిన విషాన్ని లాక్కోటానికి ఎక్కువసేపు పట్టింది. 'అయిందా?' అన్నాడు. పాము కదలలేదు. 'కాని త్వరగా'అన్నాడు లాక్కోవడం పూర్తి అయిన తర్వాత వెనుకకు తిరిగింది. "జాగ్రత్తగా వెళ్లు" అన్నాడు. వెళ్ళిపోయింది తర్వాత మళ్లీ మంత్రం వేసి ఆ చోటును స్పృశించాడు రోగి లేచి కూర్చున్నాడు నీరసంతో. ఆవరణ గేటు తీసిన తర్వాత మళ్ళీ జనం లోపలికి వచ్చారు. పాములవాడు కూడ వచ్చి రోగి కూర్చోవడం చూసి ఆశ్చర్యపోయాడు. "దొరో! ముందరే ఆ మంత్రం వేయకపోయారా?" అని అడిగాడు. "నువ్వు ముందు వేయటం ప్రారంభించావు అయినా అడక్కుండా మంత్రం వేయకూడదని గుర్వాజ్ఞ" అన్నాడు మూర్తి.

"మీ గురువుగా రెవరండీ?" అన్నాడు. గురువు పేరు చెప్పకూడదు కానీ ఆయన చాలా గట్టివాడు. ఆయన తన కొడుకుకు పాము మంత్రం చెబితే వాడు ఊరి బయట పుట్టలోనుంచి పాములను బయటకు రప్పించి కట్టుకట్టితే అవి నిలబడిపోయాయట తర్వాత అతను దానిని మరచిపోయి ఇంటికివచ్చి విస్తట్లో అన్నం వడ్డించిన తర్వాత జ్ఞాపకం వచ్చి కట్టు విప్ప డానికి పరిగెత్తాడట? గురువుగారా విషయం తెలుసుకొని అవి కట్టులో ఉండగా వాటి నెవరైనా చంపితే నీ కళ్ళు పోయి ఉండేవి అని చెప్పి, పాముల జోలికి ఇక ముందు వెళ్ళద్దని చెప్పి అల్లా ప్రమాణం చేయించుకున్నాడు.

ఒకమాటు ఒకత్రాచు ఒకడిని పగబట్టి, వాడు భార్యతో మంచంమీద పడుకున్నప్పుడా భార్య తన జుట్టు నేలమీద పడేటట్లు వేలాడేసి పడుకుంటే,ఆజుట్టు ఆధారంగా మంచం ఎక్కి అతణ్ణి కాటేసింది. అల్లాటి ఆధారం లేకుండా పాము మంచం ఎక్కదు. అప్పుడు మా గురువుగారు సర్పాన్ని ఆకర్షించి విషాన్ని తిరిగి పీల్చుకునేటట్లు చేశారు. అది నేను చూసి మోజుపడి చెప్పకున్నాను." అన్నాడు మూర్తి. 'మీ మంత్రం దొడ్డది దొరా! నాకు చెప్పండి' అన్నాడు పాముల వాడు 'దానికి ఎంతో నియమ నిగ్రహాలు కలవాడై యుండాలి అందరికీ చెప్పకూడదు. గుర్వాజ్ఞ లేదు.'

ఆ భూస్వామి ఇదంతా విని, నాలుగువేల రూపాయలు తెచ్చి మూర్తికి ఇవ్వబోయాడు. డాక్టర్‌మూర్తి 'ఇప్పుడే చెప్పాను కదా — నియమ నిగ్రహాలు కావాలని' ద్రవ్యం తీసుకుంటే మరి మంత్రం పనిచేయదు. ప్రత్యవాయం కూడా ఉంటుంది' అని లేచాడు. 'మీరు నా ప్రాణదాత' అని ఆ ఆసామి డాక్టర్ కాళ్ళమీద పడ్డాడు. "మీ ఆయుర్దాయం గట్టి' అని నవ్వుతూ వెళ్ళిపోయాడు మూర్తి మూర్తి వైద్యవృత్తికే ఆదర్శమూర్తి అనుకున్నా రందరూ.



# '6'ద్ర కవిత్వోపనిషత్తు

ఎల్. సంగయ్య, ఎం.ఏ

(6ద్ర) అను ద్రకవిత్వోపనిషత్తులో పైలాపచ్చీసు కావ్యము నందలి వైచిత్రి:

"వర్తమాన కవిత ఏమిటో తెలుసా వరదా
ఆది భూత భవితవ్యాల మధ్య ట్రాన్స్పరెంట్ వరదా" అని

సినీవాలిలో సాహిత్యోపనిషత్తులో అన్నమాటలు.

"అభ్యుదయోద్యమం తెలుగు సాహిత్యం లో గ్రాంథిక భాషకు శాశ్వతంగా ఉద్వాసన చెప్పింది. వ్యావహారిక భాష విజయ పతాకం ఎగురవేసింది. కవిత్వంలో గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నడ్డి విరగ్గొట్టి మాత్రా బద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్యాన్ని స్థాపించింది" అని వర్తమాన కవిత గురించి శ్రీ శ్రీ గారన్న మాటలు. ఈమాటల తత్వాన్ని ఇముడ్చుకొన్న కావ్యం ఆరుద్ర పైలా పచ్చీసు.

"పైలా పచ్చీసు"కు మూల రూపమైన "పహలా పచ్చీసు" వాడుకలో పైలా పచ్చీసుగా మారినది. పైలా పచ్చీసు అంటే మొదటి ఇరువది ఐదేండ్లు అని అర్థం. లేక 25 సం॥లకు ముందర అని అర్థం. ఈ పుస్తకం ప్రథమ ముద్రణ 1967లో జరిగింది. ఇందులోని "లోహవిహంగాలు" అనే గేయం 1942కు ముందు ఆరుద్ర గేయాలను మెచ్చుకోనటువంటి శ్రీ శ్రీ ఈ గేయం వినగానే "అబ్బ! పెడతారి వదిలేసి ఎడదారి ఎక్కావు 'గుడ్! ఇది నీ రస్తా ఊఁ. సాగిపో' అన్నాడట, చాగంటి సోమయాజులు, రోణంకి అప్పల స్వామిగార్లు కూడా డిటో, డిటో రైతో అన్నారట" అంతకు ముందు నాలుగేళ్ల నుండి ఎంబ్రియో స్థితిలో ఉన్న నిజ కవిత ప్రభవించి పురిటి కేకవేసిందని ఈ యేడు ఆ కవిత పైలా పచ్చీసు జూబిలీ చేసుకోవచ్చని "1967లో పైలా పచ్చీసు కావ్యంలో వ్రాసికొన్న తొలి పలుకులు. ప్రాచీన కావ్యాల పేర్ల కంటె భిన్నంగా ఆధునిక కావ్యాల పేర్ల కన్న కూడా భిన్నంగా హిందీ పదము పైలా పచ్చీసు" అని పేరు పెట్టి. ఆ పేరు వెనుక ఎంత కథ ఇమిడి ఉన్నదో చూపించినారు. ఈ పేరు వెనుక నున్న చరిత్రను తాను చెప్పే వరకు మనము ఈ కావ్యనామ సార్థక్యతను గుర్తించలేము. అందరు కవుల కన్నా ప్రత్యేకమైనదారి ఆరు ద్రది. ఆరుద్రకు నవ్యతా ప్రీతి మెండు. అందుకే ఆరుద్రరచనల్లో అట్ట మీద బొమ్మ నుండి అట్ట చివరవరకు ఈ నవ్యతా ప్రీతి, వైచిత్రీ ప్రియత్వమూ కనిపిస్తుంటాయి.

శాంతికి సంకేతమైన తెల్లని వస్త్రధారణ చేసిన మనిషి నల్లని సిరాచీకట్లను త్రాగుతూ, సామ్యవాదపు వెలుగుల్ని విరజిమ్మడానికి తన చేతనను చేతిగా చేసికొని, మనో బలాన్ని కలంగా పట్టుకొని పైలా పచ్చీసుగా కవిత వ్రాస్తున్న అట్ట మీది ఆరుద్ర బొమ్మను చూస్తేనే క్రొత్త దనం (నవ్యత) కొట్టొచ్చినట్లుగా కనిపిస్తుంది. అట్ట వెనుక కూడా తన ఫోటో వేసి కోవటానికి గాను గీతలు గీసి దానిలో ఫొటో వేసి కోకుండా ఆరుద్ర అని సంతకం చేస్తాడు ఫోటో సైజు గీతలు లేకుండానే సంతకం చెయ్యొచ్చు కాని అట్లు చేస్తే గమ్మత్తే ముంటుంది. అందుకే ఆరుద్రకు వైచిత్రి ప్రాణం. వైచిత్రి కవిత్వానికి ధనం. ఈ వైచిత్రిలో ఉన్న ప్రథమ గుణం పాఠకుల మేధను అట్టే అయస్కాంతంలాగా పట్టేయడం! అయస్కాంతం ఎట్లా

ఊపితే ఇనుపరకాను ఆట్లా పల్టీలు కొట్టినట్లు మన మేధకు కూడా గిలిగింతలు పుట్టి పల్టీలు గొట్టి పౌ ర ల న్ని టి సీ ప గు ల గొ ట్టి క వి త్వ ములోని అసలు తత్వాన్ని పట్టుటకు ప్రయత్నిస్తుంది. పాఠకుని బుద్ధిని కేంద్రీకరింప జేయటం కోసం చెప్పదలచు కొన్న తత్వాన్ని గమ్మత్తైన క్రొంగొత్త పద జాలంతో ఇంజెక్ట్ చేయటం కోసం ఈ వైచిత్రి ప్రయోగింపబడుతున్నది. ప్రయోజన కారి అవుతున్నది. ఆంగ్ల కవితా ప్రభావంతో విభిన్నములైన ఆధునిక శాస్త్రాల అధ్యయనము మూలముగా, అస్తవ్యస్తముగా నుండి చూచుటకు, ఆలోచించుటకు అనునిత్యము విచిత్రమైన రంగులతో కనబడుచున్న ఈ సమాజము మూలముగా అనేక పద్ధతులలో ఈ వైచిత్రి ప్రవేశించింది. సాధారణముగా కావ్యములలోని వివిధ శీర్షికలను సామాన్యముగా కవులందరు చేసేపని. కాని చూపేందుకై విషయసూచిక, పేజీ, శీర్షిక, ఆరుద్ర ~ట్లు కాదు. విషయ సూచిక అనుదానికి బదులుగా "ఉన్నవి" అని పేరు పెట్టినాడు. శీర్షిక పేరు ఆ శీర్షిక మొదలయ్యే తొలి మాటలతో పురోగమిస్తాడు.

"ఫ్యూడలిజం విధంగా
ఉండే అమావాస్యచీ
కట్లని-జీవనదుల
లోనినీళ్ళని తమర
క్తం మాదిరిగా ప్రా
ణం మాదిరిగా— వ్రాస్తాడు

అమావాస్య చీకట్లు భయంకరమైనవి. వెలుగులను మింగేసి గాఢాంధకారాన్ని పంచిపెడతాయి. అదేవిధం ఈ ఫ్యూడలిజం.

బానిస యాజమాన్య వ్యవస్థ శిధిలాలమీద, ఆదిమ సమష్టి సమా॥ వ్యవస్థ విచ్ఛిత్తిమీద అవతరించి ఆవరించిన భయంకరమైన చీకటి ఫ్యూడలిజం. ఈ ఫ్యూడల్ వ్యవస్థ భూస్వాములు రైతులను చేసే దోపిడీమీద ఆధారపడి ఉంది. భూస్వాములు రైతుల శ్రమయొక్క అదనపు ఉత్పాదితాన్ని సొంతం చేసుకొనేవాళ్ళు, డబ్బు రూపంలోగాని, వస్తురూపంలో గాని కౌలుగా రైతునుండి భూస్వామిలాగు కొనేవాడు. ఈ ఫ్యూడల్ వ్యవస్థలో ఉన్న దోపిడీని కట్ చేయాలనే కసిని వ్యక్తీకరణలో అమావాస్యచీ- అని ఒక పాదంలో కట్లని అని రెండవ పాదం మొదట కట్ చేసివేసి వ్యక్తీకరణలో శాబ్దికమైన వైచిత్రిని సాధించినాడు.

అబ్బూరి రామకృష్ణారావుగారు ఇలాంటి పాదాల్ని దృష్టిలో పెట్టుకొని, ఇవి సింగిల్‌పన్నా కవిత్వాలని- ఉదాహరకు.

శ్రీపే

ట్లేలు అ
మ్మబడును"

అని ఎక్కడో బోర్డుమీద చూసిన వాక్యాల్ని ఇచ్చారు. కాని రామకృష్ణారావుగారన్నట్లు ఇవి సింగిల్ పన్నా కవిత్వాలుకావు. మనస్సులో ఉన్న భావాన్ని, దాని తీవ్రతను పదాలప్రయోగం ద్వారా వ్యక్తీకరించి కృతకృత్యుడైనాడు కవిగా ఆరుద్ర. చీకట్లు అని ఒకే వాక్యంలో వ్రాస్తే దానిని గురించి అంతగా ఆలోచించే వాళ్ళుకాదు. ఇది భావానుగుణంగా విశిష్టమైన రీతిలో చేసే వ్యక్తీకరణ. కనుక ఇది శబ్దవైచిత్రిలోనికి ఒదుగుతుంది.

ఆరుద్ర మీటల పాట గేయంలో
"భగవంతుడి ఆఫీసుకి
ఫోనేలేదు నేను ఫోనేపోను.

సాంప్రదాయ కవితలోని ఛాందసత్వాన్ని, ఆధునికతలోని వాస్తవికతతో నోరు మూయించటం పై ఉదాహరణలో మనకు కనబడుతుంది.

సామ్యవాదియైనవాడు బూర్జువాలు కొలిచే భగవంతుడ్ని తలవడు. భగవంతుడు తలలేనివాడని తెలుసు. పలుకులేనివాడని తెలుసు. ఉనికిలేనివాడని తెలుసు. కనుకనే ఆరుద్ర 'భగవంతుడి ఆఫీసుకి ఫోనేలేదు;

నేను పోనేపోను.' అని ఉన్నత భావాలు ధ్వనించే విధంగా 'ఫోనే,' 'పోనే' అని ఒకటే ధ్వని కలిగిన, భిన్నార్థాలు కలిగిన రెండుభాషలలోని సామ్యత కలిగిన శబ్దాలను ప్రయోగించి సామ్యవాది హృదయపు చప్పుళ్ళను నవ్యరీతిలో ధ్వనింపచేసినాడు.

మనం నివసిస్తున్నది అణుయుగం. ఈ అణుయుగం ఎంత ప్రయోజనకారియో అంత ప్రమాదకరమైనదికూడా. అందుకే అణుబాంబు మాటవింటే గుండెల్లో అలజడి, మనసులో అశాంతి. అది మన శాపమే కావచ్చు. మనస్తాపమే కావచ్చు. మూడుతరాల ముచ్చట్లు గుర్తుకురానూరావచ్చు. అందుకే ఆరుద్ర ఆధువరాణువగేయంలో

అణుచాపం. అణుచాపం
అణుచాపం, మనశాపం
అణుచాపం, అణుచాపం
అణుచాపం, మనస్తాపంన్

అణుచాపం ఆవృతిలో మనశాపాన్ని మనస్తాపాన్ని వ్యక్తీకరించి కొత్తదనాన్ని కొండగా పేర్చినాడు ఆరుద్ర.

ఆధునిక వైజ్ఞానిక పదబంధముల ప్రయోగము ద్వారా భావములో సంవిధానములో సాధించినవైచిత్రి.

ఆరుద్ర 'అవలీలగా' అనుగేయంలో
సౌర" కుటుంబం హోల్డాలు చుట్టుకొని
గెలాక్సీల సూటుకేసు పట్టుకొని
దుగ్ధ పథం కండువా వేసికొని
తోక చుక్కల టిఫిన్ కారియర్ నిండా
జనన మరణాల చపాతీ దొంతితో
ఉపనిషత్తుల నేపథ్యగానం వింటూ
టిక్కెట్టు లేకుండా
ప్రయాణం చేస్తున్నాడు
విశ్వ యాత్రికుడు."

విశ్వయాత్రికుడు త్రివిక్రముడంతటి వాడ్ని అధిగమించినవాడు.

సూర్యుడూ, సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తున్న బుధుడు శుక్రుడు, భూమి, కుజుడు, గురుడు, శని, యురేనస్, నెప్ట్యూన్, ప్లూటో ఈ నవగ్రహ కూటమి సౌరవ్యవస్థ. వీనిలో సూర్యుడు నిరంతరం మండుతూ ఉండే వాయు గోళం ఈ వ్యవస్థలో నక్షత్రంలాంటివాడు. ఈ తొమ్మిది గ్రహాలు సూర్యుని ఆకర్షణ శక్తికి లోబడి పరిభ్రమిస్తూ వెలుతురుకు వేడికి సూర్యుని మీద ఆధారపడి ఉంటాయి. సూర్యుడు ఈ కుటుంబానికి ఆధారం కనుక సౌరకుటుంబం అయ్యింది. ఆకాశమనే చాపని చుట్టి చంకను పెట్టినట్లుగా సౌర కుటుంబాన్ని మొత్తాన్ని బెడ్డింగుగా చుట్టి చంకను పెట్టుకున్నాడు ఈనాటి విశ్వ యాత్రికుడు. మానవుడు విజ్ఞానంలో ఎంత ఎత్తుకు ఎదిగాడు అనే విషయాన్ని వ్యక్తీకరించటానికై "సౌర కుంటుంబం హోల్డాలు చుట్టుకొని" అని ప్రయోగించాడు. సౌర కుటుంబం చంకన పెట్టుకొని అని ప్రయోగిస్తే ఈ సౌందర్యం రాదు కనుక సౌరకుంటుబం హోల్డాలు (బెడ్డింగు) చుట్టుకొని అని సౌందర్యం కోసం ప్రయోగించాడు. 'సౌందర్యమే విచిత్రం' కదా! సాభిప్రాయంగా నూతన పద ప్రయోగం చేసి నవ్య వ్యక్తీకరణకు తోడ్పడి నాడు ఈ విశ్వయాత్రికుడు నక్షత్ర వీధిని సూట్ కేస్‌లో పెట్టుకున్నాడు. చంద్రమండలంపై పాదం మోపి చంద్రుడి గురించి పరిశోధనలు జరిపి ఫలితాన్ని మెదడు అనే సూటుకేసులో పెట్టుకొన్న విశ్వయాత్రికుడు. అందుకే 'గెలాక్సీల సూట్ కేస్ పట్టుకొని' అనే ప్రయోగం. విశ్వయాత్రికుడి కండువాగా నిలిచింది దుగ్ధ పథం. ఈ 'దుగ్ధ పథం' 'Milky way' అనే దానికి అనువాద రూపం. Milky way అంటే నక్షత్ర కూటమి. దీనినే పాలపుంత అని, ఆకాశగంగ అని పిలుస్తారు. దానిని కండువగా వేసికొన్నవాడు. అనుటలోనే భావ వైచిత్రిమనకు స్ఫురిస్తుంది.

తోక చుక్క కనబడితే కీడుగాని మేలుగాని జరుగుతుందని కొందరి అభిప్రాయం, 1835లో హేలీ తోక

చుక్క కనిపించిన సంవత్సరమే ప్రఖ్యాత అమెరికన్ రచయిత మార్క్ ట్వేన్ జన్మించాడట ఇట్లా జరగటం కాక తాళీయమేనని శాస్త్రవేత్తల వాదన టిఫిన్ కారియర్‌లో ఆహారం పెట్టుకొనే దొంతులను తోక చుక్కతో పోల్చి టిఫిన్ కారియర్‌లోని చపాతీ దొంతిని తోక చుక్కలోని జనన మరణాల దొంతితో పోల్చటం ఆలంకారికమైన వైచిత్రి ఇది అతినవ్యమైనది. ఇంత విజ్ఞానం సాధించినా వేదాంతాన్ని నేపథ్యగానంగా వింటూ, అంటే జగం మిథ్య అంటూ టికెట్టు లేకుండా ప్రయాణం చేస్తున్నాడు ఈనాటి విశ్వ యాత్రికుడు "అనే మలుపులో భావ వైచిత్రి పొదిగినారు అరుద్రగారు ఒక్కొక్క సిరాబిందువులో సింధువులను దాచుకొన్న కవిత ఇది విజ్ఞాన ఖనులను ఇముడ్చుకొన్న అక్షర కవిత ఇది. ఈ విధంగా అక్షర రూపం దాల్చిన ఒక్కొక్క సిరా చుక్కయే లక్ష మెదళ్ళను కదిలిస్తుంది కుదిపేస్తుంది.

వెయ్యి వోల్టుల కవిత్వం అన్న గేయంలో సంవిధానం విద్యుత్ ప్రవహించే రీతిగా నడుస్తుంది. విద్యుత్‌లో పోజిటివ్, నెగిటివ్ ఉంటాయి. పోజిటివ్, నెగిటివ్ కలిస్తే కరెంటు కాలిపోతుంది. + + కలిపితేనే లైటు వెలుగుతుంది. '—వైరు (మైనస్ వైరు) లేకపోయినా లైటు వెలగదు' ఈ గేయం అంగారాన్ని, శృంగారాన్ని రంగరించుకొన్న కవితారంగం. ప్లస్ గుర్తుగల వాక్యాలు ప్రభుత్వాన్ని విమర్శించేదిగా మైనస్ గుర్తుగల వాక్యాలు రసికత్వానికి చిహ్నాలుగా ఉన్నాయి. ప్లస్ గుర్తుగల వాక్యాలు మొత్తం చదివిన తరువాతనే మైనస్ (—) గుర్తుగల వాక్యాలను చదవాలి. అప్పుడే అర్థానికి అన్వయం కుదురుతుంది ఈ గేయంలో చివరకు మాత్రం + ప్లస్, మైనస్ (—) గుర్తుగల వాక్యాలకు అన్వయం కుదిరి ఇంతలోకే ఇంద్రజాలం కరిగి పోవాలా? అంటాడు.

+ గారడీవాడు ప్రవేశించి రకరకాల ప్రణాళికల
కాగితం పువ్వులు
వాసన చూపెట్టి
—నా బాధే ప్రేయసి
అది
స్వర్గాదపి గరీయసీ
+ పారిజాత సుమాలు సుమా అంటే గారడీవాడి
కోరిక మీద పుర
జనులం మనం చప్పట్లు
—ముళ్ళ కంచెలు మేసి బలిసిన
చింత నిప్పుల కంటి రెప్పలు
ఎప్పుడయ్యా కప్పు కుంటాయి.
+ కొడతాం—.

ఈ గేయంలో ప్లస్ (+) గుర్తుగల వాక్యాలన్నీ వచనంలో వ్రాస్తూ, మైనస్ (—) గుర్తుగల వాక్యాలన్నీ ముత్యాల సరాలుగా మలచాడు.

ఈ ముత్యాల సరాలలోనే 14మాత్రల వాక్యాలని మూడు వ్రాసి, 12 మాత్రల వాక్యంగాని, 8 మాత్రల వాక్యంగాని నాల్గవ పాదంగా వ్రాయక పోవటం ఈ కింది భాగంలో కన్పిస్తుంది.

—ముళ్ళ కంచెలు మేసి బలిసిన
చింత నిప్పుల కంటి రెప్పలు
ఎప్పుడయ్యా కప్పుకుంటాయి.

దీనిలో నాల్గవ పాదంలేదు.

—ఏడు మేడల మీద నుండే
ఏడు మల్లెల ఎత్తుతూగే
రాచ చిన్నది ఎప్పుడయ్యా
తొంగి చూస్తుంది—

ఈ భాగంలో పై మూడు వాక్యాలలో 14 మాత్రలు, నాలుగో వాక్యంలో 8 మాత్రలు ఉన్నాయి. ఈ విధంగా ఈ గేయంలో మూడు మైనస్ గుర్తుగల భాగాలున్నాయి. ముత్యాల సరానికి మూడు పాదాలు 14 మాత్రలు కలిగి, నాల్గవ

పాదం 12 మాత్రలు కలిగి ఉండాలి. తరువాత కవులు చివరి వాక్యంలో అనేక మార్పులు చేశారు. 12 మాత్రలు కాకుండా 10 మాత్రలతో, 8 మాత్రలతో వ్రాయటం, అసలు చివరి వాక్యాన్ని వ్రాయక పోవటం, 14 మాత్రలు కలిగిన వాక్యాలను రెండు వ్రాసి, 8 మాత్రల వాక్యం ఒకటి వ్రాసి ముగించటం. ఈ ముత్యాల సరాన్ని ఇన్ని రకాలుగా కవులు ప్రయోగించినారు.

"కోటి జలపాతాల మాదిరి.

ఉరుకు కోర్కెల కానకట్టలు

విరకొట్టింది"— దీనిలో రెండు పాదాలు 14 మాత్రలు కలిగి, ఒక పాదం 8 మాత్రలు కలిగి ఉండటం, ఈ గేయంలో వచనంలో ముత్యాల సరాల్ని ఇరికించటం. ఇది ఛందస్సులో, భావంలో వైచిత్రిని సాధించినాడు.

కవులు అనేకంగా వ్రాసిన ప్యారడీలలో భావ వైచిత్రి మనకుద్యోతకమవుతుంది. కవి మనసులో మెరిసే విశిష్టమైన భావనాడోల భావ వైచిత్రిగా ఈ ప్యారడీలలో మసలుతుంది.

ఆరుద్ర గారు

భరతఖండము నేడొక వంటశాల

వండుచున్నాము తీయని పిండివంట

విందు దినుసులలోన ఓ వెర్రివాడ

వేయవలదయ్య చాటుగా విషపుబొట్టు-ఈ పద్యము చిలకమర్తి లక్ష్మి నరసింహముగారి—

భరత ఖండంబు చక్కని పాడియావు

హిందువులు లేగ దూడలై ఏడ్చుచుండ

తెల్లవారను గడుసరి గొల్ల వారు

పితుకుచున్నారు మూతులు బిగియబట్టి. అను పద్యమునకు ప్యారడీగా భాసిల్లు చున్నది.

ఆరుద్రగారి పైలా పచ్చీసు కావ్యంలో శబ్ద వైచిత్రికి అనేకముగా ఉధాహరణలు కలవు. ఆధునిక జీవితములో కర్త్రీ, నాగరికత కర్త్రీ, కర్త్రీ నడవడికలను ప్రతిబింబింపజేయుటకై చేసిన విచిత్ర ప్రయోగములు.

మార్చవుతూ పోదాం, మార్చి + అవుతూ— మార్చవుతు ఆంగ్ల పదము Marchకు అవుతు అనే తెలుగు అసమాపకక్రియకు సంధి చేసినాడు. వ్యాకరణాల సంకెళ్ళు విదుల్చుకొని సంబంధిత వైచిత్రి ఇటువంటివే అసూర్యం పశ్యలు, హయిహీలు యానలు, గూడ్సు గమనలు. 'అసూర్యంపశ్యలు' సమాసములో తెలుగు పదాన్ని సంస్కృతీకరించడం, సంస్కృత పదాన్ని తెలుగు పదంగా మార్చేయడం, దాన్ని సమాసంగా ప్రయోగించడం లాంటి ఫీట్సు కనబడతాయి. సూర్యపదమునకు సంస్కృత ద్వితీయా విభక్తి ప్రత్యయము 'అమ్' చేర్చి 'సూర్యం' పశ్య అను సంస్కృత క్రియకు 'లు' అను బహువచన ప్రత్యయము చేర్చి, పశ్యలు అని, వీటికి 'అ' అను ఉపసర్గను చేర్చి అసూర్యంపశ్యలుగా సమాసము కూర్చినాడు. 'హయిహీలు' అనునది ఆంగ్లపదము 'యాన' అనునది సంస్కృత పదము గూడ్సు అను నది ఆంగ్ల పదము, గమన అన్నది సంస్కృతపదము ఈ రెంటిని కలిపి 'గూడ్సు గమనులు'గా మార్చినాడు. ఇందు శబ్ద వైచిత్రియే కాక భావ వైచిత్రి కూడా తళుక్కున మెరయుచున్నది. ఇదే విధముగా 'డెత్ కన్య' అని.

"అందాకాభూలోకం పరుపు మీద" అని పలికిన ఆరుద్రయే ఆల్పి సూదులపరుప్మీద-అని సంధికొదగని రెండు పదాలకు (పరుపు + మీద) విశిష్టమైన రీతిలో సంధిచేసి ప్రయోగించినాడు.

"పేనికానలం మానవాళిలో రగుల్తున్నది.

Panic + అనలం = భయంకరమైన అగ్ని-అనే అర్థంలో ఆంగ్లాంధ్ర పదములకు సంధి కూర్చినాడు. ఆరుద్రపై ఆంగ్ల ప్రభావం కన్పిస్తుంది. ప్రత్యేకంగా ఇ.ఇ. కమ్మింగ్స్ ప్రభావం ఆరుద్ర రచనా రీతిలో ముద్రవేసికొన్నది. ఆరుద్ర-మెదడుకు గిలిగిం

తలు పెట్టే చురుకైన భావన కలిగినవాడు. కొత్త కొత్త పదజాలంతో తనదైన శైలిని నిర్మించుకొన్న వాడు. కావ్య నామకరణం నుండి, కావ్యం అంతం అయ్యే వరకు ఏదో ఒక రకంగా వైచిత్రి ఆరుద్ర కవితల్లో గోచరమవుతుంది. మనసులో గిలిగింతలు పెడుతుంది. ఆహా! అనిపిస్తుంది. విషాదాన్ని కూడా వైచిత్ర్యముతో రసగుళి కలుగాచేసి హృదయాన్ని బుద్ధిని ఏక కేంద్రంలో కలిసేటట్లుగా చేయగలడు. అదే ఆరుద్ర కవితోపనిషత్తు. అందుకు ఆరుద్ర కవితల్లో అంత్య ప్రాసలు చెంత చెంతనే పొంచి ఉంటాయి. అధునాతన పదాలు కదం త్రొక్కుతుం టాయి. నవ, నవలాడే ఉపమానాలు, కొత్త రంగుల నలంకరించుకొన్న సోఫాలుగా కుదురుకొని ఇంద్ర ధనుస్సులా వింత కాంతుల్ని వెదజల్లు తుంటాయి. అందుకే ఇది ఆరుద్ర కవితోపనిషత్తు.

తెలుగుశాఖ,
ఉ. విద్యాలయము,
హైదరాబాదు-7

# ప్రతాపరుద్రీయం-శబ్దాశ్రయ హాస్యం

— ఈసర్ల అప్పారావు, ఎమ్.ఏ.

వికృతమైన ఆకారం, వాక్కు, వేషం, చేష్టల మూలంగానే కాక సన్నివేశగతంగా కూడ హాస్యం సిద్ధిస్తుంది. ఒక విధమైన అసహజత్వం, వైపరీత్యం ఆకారంలో గాని, చేష్టలలో గాని, వేషంలో గాని ప్రదర్శించి హాస్యాన్నిసాధించినట్లే రమ్యమైనసన్నివేశాన్ని కల్పించి కూడ సమర్థుడైన రచయిత హాస్యావిష్కరణ కావించగలడు. శబ్దాలకూర్పులో గాని, అర్థంలోగాని, భావంలో గాని చమత్కారంగా వికృతిని దర్శింపజేసి హాస్యావిష్కరణ గావిస్తే అది భాషాపరమైన హాస్యం అవుతుంది. ఈ భాషాపరమైన హాస్యంలో మొదటి సారిగా గణనలోనికి వచ్చేది శబ్దాశ్రయ హాస్యం. భావంలో ఉండే వికృతికంటే శబ్దాలకూర్పులో ఉండే వికృతి సద్యఃస్ఫురణకు కారణం అవుతుంది. భావగతమైన హాస్యానికి కొంత సంస్కారం అవసరం. శాబ్దిక హాస్యానికి శబ్దస్వరూప పరిజ్ఞానం అవసరం అయినా అది సాధారణంగా సర్వజన గ్రాహకంగా ఉంటుంది.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ బ్రహ్మశ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారి ప్రతాపరుద్రీయ నాటకం వీరరస ప్రధానమైనదైనా అందులో అన్ని విధాలా హాస్యం పోషించబడ్డది. అందులో ప్రథమంగా గణనలోనికి వచ్చేది హాస్యం. ఈ నాటకంలో శ్రీశాస్త్రి గారు గ్రామ్యపదప్రయోగం, తురక తెలుగు, వృత్తి పరిభాషలు, చెకుముకి శబ్దచమత్కృతి, పిచ్చివాడి మాటల గారడీ వంటి అంశాలు చేపట్టి శాబ్దికహాసాన్ని సాధించారు.

## గ్రామ్యపద ప్రయోగం-హాస్యం

శ్రీశాస్త్రి గారి నాటకంలో సంస్కృత లక్షణాను సారంగా నీచపాత్రలకు గ్రామ్యం వాడబడ్డది. పేరిగాడు, ఎల్లి, చాకళ్ళు, మంగళ్ళు, పడవ సరంగులు మొదలైన పాత్రలు గ్రామ్యాన్ని ఆశ్రయించాయి. తద్వారా కొంతవరకు హాస్యం ఉత్పన్నమయ్యింది.

పామరజన వ్యవహారంలో పడి రూపభేదాన్ని పొందిన పదాలు, అపరిచితులైన గ్రామ్యపదాలు, విచిత్రంగా అనిపించి హాస్యం జనిస్తుంది. దీనితో ఆయా మాండలికాలకు చెందిన ఉచ్చారణలో గల యాస (Accent) తో నటులు సంభాషించడం మూలంగా ఈ గ్రామ్యపదపరమైన హాస్యానికి మరికొంత చేయూత లభిస్తుంది అందులోని భావం కాని భావగత చమత్కారం గాని భాసించక పూర్వమే శబ్ద చమత్కృతితో కూడిన గ్రామ్యపద ప్రయోగం హాస్యోత్పాదకం అవుతుంది.

పేరి : "ఓయె బాబో తాతల్లో! అమ్మల్లో! నన్ను నంకేశినా నాను బదుకుతాను గాని, యెల్లి లేక పోతే నాను బదకలేను మారాజా. రచ్చించాల రచ్చించాల.

భావంతో పనిలేకుండానే గ్రామ్యపదాలు, విశాఖపట్టణ మాండలిక యాసతో కూడిన నటుల ఉచ్చారణ పై పేరయ్య గ్రామ్యభాషా పరహాస్యానికి కారణం.

గ్రామ్యం ఆయాజాతుల సంభాషణలలో వాడదగ్గదయ్యే, దానివలన హాస్యం సిద్ధిస్తుందని లాక్షణికులు చెప్పకపోలేదు. విశ్వనాథుడు వికృతమైన వాక్కు వలన హాస్యం సిద్ధిస్తుందని చెప్పెనే కాని ఆ వికృతికి మార్గాలు సూచించలేదు. కాని పెదకోమటి వేమభూపాలుడు మృగ, పక్ష్యాది స్వరాలను, మానవ వాక్యాలను

వేదశాస్త్ర విద్యాదేశ భాషాదికాల ననుసరించుట, అసంబద్ధాలు, అసత్ప్రలాపాలు అయిన వాచికాలు హాస్యోత్పత్తికి కారణాలనికివివరించారు.

విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో

"ఈసడములు గోరడములు
గాసర బీసరులునైన కట్టడిపలుకుల్
భాసిల్లు గ్రామ్యములునా
హాస్యోక్తులు దెగడు చోట నవియును నొప్పున్"

అని హాస్యోక్తులలో గ్రామ్యం వాడడం గురించి చెప్పారు.

శ్రీ శాస్త్రిగారు కూడ గ్రామ్యం హాస్యకారక మని గుర్తించకపోలేదు. ఈ క్రింది "గ్రామ్య భాషా ప్రయోగ నిబంధనము నందలి వాక్యాలే అందుకు సాక్షి.

"...... సర్వరూపకముల యందును, ఉపరూపకముల యందును గ్రామ్యము ప్రయోక్తవ్య మగును. హాస్యరసమున కిది యనుకూలమందు కాని హాస్యము నాటకముల యందును అపేక్షణీయమే " (60)

ముఖ్యంగా ఈ నాటకంలో గ్రాంధికం అధికంగా ఉండడం మూలంగా మధ్యలో ప్రవేశించిన గ్రామ్యం హాస్యకారకం అవుతుంది. ఇతివృత్త మేదైనా పాత్రలన్నీ సాధారణంగా వ్యావహారికాన్ని గాని, గ్రామాల్ని మాట్లాడడం వలన హాస్య- కలగకపోయినా ఒకటి, రెండు పాత్రలు మాత్రమే గ్రామ్యాన్ని ఆశ్రయించక తప్పదు. సంస్కృత నాటకాలలో సీత, శకుంతల మొదలైన ఉదాత్తపాత్రలుకూడ ప్రాకృతాన్నే భాషించడం వలన హాస్యం జనించడం లేదని భావించవలసి ఉంటుంది.

"దేశభాషా క్రియా వేష లక్షణాః స్యుః
ప్రవృత్తయః
లోకాదేవాచ గమ్యైతా యధౌచిత్యం
ప్రయోజయేత్

యద్దేశం నీచపాత్రం యత్తద్దేశం తస్య
భాషితమ్

పాత్రలకు సంబంధించిన దేశకాలాలను పరిశీలించి తదనుగుణ్యమైన ఆచారం, వేషం, భాష మొదలైన వాటిని లోకాన్ని పరిశీలించి నాటక రచయిత సేకరించి కూర్చవలెను. నీచపాత్ర నివసించే ప్రదేశమేదో ఆ ప్రదేశానికి సంబంధించిన భాషనే వాడాలి అని ధనంజయుని తీర్పు. ప్రతాపరుద్రీయ నాటక రచన నాటి వరంగల్లు మాండలికం నీచపాత్రలకు వాడడం అవసరం. అయితే విశాఖపట్టణమాండలికాన్ని వాడడం ద్వారా ఆ యాసలో ఉండే వైపరీత్యం హాస్యానికి కారణం అయింది.

## భాషాసాంకర్యం-హాస్యం

రెండు విభిన్న భాషాపదాల కలయిక చమత్కారపూరితమైన వికృతికి కారణం అవుతుంది. ప్రతాపరుద్రీయ నాటకంలో తెలుగు, తురక భాషల సాంకర్యం ఏర్పడ్డది. తద్వారా ఆ భాష హాస్యావిష్కరణ కుపయోగపడ్డది.

సిపా : "బడామంతిర్ యుఘందర్ వచ్చినాల్, వలీ ఖాన్ సర్దార్ పోయే దారిమే జంగల్మొగాళంమే మన పేరిగాడ్కి రాజావేషం వేసి బైటో చేసినార్ రాజా గోడాకి కూడ వేటావేషం వేశి ఘాజ్ మైదానంలో వుంచినార్. వలీఖాన్ సర్దార్ మోషంపోయి మషాల్వాలా పేరిగాడ్కి రాజా తల్చి పకడ్దేవు చేశినార్:.........

మణిప్రవాళ శైలిలా అల్లుకుపోయిన ఉరుదూ, తెలుగుల కలయికతో బాటు, మహమ్మదీయ పాత్రలు తెలుగు మాట్లాడడానికి ప్రయత్నించినపుడు చేసే ప్రయోగాలన్ని ఈ భాషలో కనిపిస్తాయి. తెలుగు పదాలకు తురక షష్ఠి చేర్చడం, హకార-షకారాలను అంటగట్టడం, ఉరుదూ సంప్రదాయాల్ని కొన్నింటిని

తెలుగుకు చేర్చడం వంటి విశేషాలు ఈ సాంకర్యంతో చోటు చేసుకొని హాస్యకారణా లయ్యాయి.

సిపా : మన చాకల్దానీ లేదూ యెల్లి? అదికి మొగుడీకి వలీఖాన్ సర్దార్ పట్టుకోని ఢిల్లీకి పోయినాల్, అంటుంది. అందుకోసం అది తన్ను సంపీ యెశినా మననే నౌకరీ శెయ్యడం లేదూ అంటుంది....... నేను ఈ దుస్తులు ఎవరి సేతానైనా ఉత్కుదాయన తెచ్చినాను,......'

తెలుగుభాషా పదాల స్వరూపం తెలిసీ కొంత తెలియక కొంత వారి యాసతో మాట్లాడడం ఉరుదూ భాషాపరమైన సాంకర్య హాస్యానికి ఒక కారణం. శ్రీ శాస్త్రిగారు వింతగొలిపే ముసల్మానుల మాటలను బాల్యంనుండి పరిశీలించి ఈ నాటకంలో మహమ్మదీయ సంభాషణలను రచించారు

ఉరుదూ, తెలుగు పదాల సాంకర్యంతో బాటు తమిళ కన్నడాల కలయిక కూడ షష్ఠాంకంలో పేలయ్య, చెకుముకుల హాస్యానికి తోడయ్యింది

ముందు పేర్కొన్నట్లు చెకుముకి శబ్ద చమతత్కృతి యుగంధరుని మాటలగారడీ, చాకళ్ళ, మంగళ్ళవృత్తి పరిభాషలు, శబ్దాశ్రయమైన హాస్యసాధకాలే నాసికా వ్రణితుని అనునాసికోచ్చారణ, పేరయ్య 'సారాశెంబు కాదు'. 'దూడపేడ', 'బర్రెపేడ' మొదలైనవి కూడ ఈ కోవకు చెందినవే. వీటిని వేరువేరు ప్రకరణాలుగా విభజించి పరిశీలించడానికి అవకాశముంది. శాస్త్రిగారి నాటకంలో వివిధ కోణాలలో హాస్యాన్ని దర్శించడానికి కావలసిన శబ్ద చమత్కృతి ఉంది. అది సున్నితంగానే సాగిందని చెప్పవచ్చు. అయితే అది ఉత్తమ హాస్యం కాదనే భావన లేకపోలేదు. శాస్త్రిగారి హాస్యం తురక భాషాసంపర్కంతో మైలపడి మనది కాకుండా పోయిందని మునిమాణిక్యం వారి అభిప్రాయం.సులభ సుందర గ్రాంధికంలో గ్రామ్యం, తురక 'కి' షష్ఠి చొప్పించడం తప్ప రచనా సామర్థ్యం కాని, ప్రజ్ఞా చమత్కారం కాని లేవని శేషగిరిరావు గారి భావన. అయితే సంస్కృత మడి విడిచి కేవలం భావమూలంగాను, చేష్టామూలంగానే గాక శాబ్దికమైన హాస్యాన్ని సయితము సాధించవచ్చునని నిరూపించిన ఖ్యాతి ప్రథమంగా గురజాడ, వేదం వార్లకే దక్కుతుంది. శబ్దపరమైన హాస్యాన్ని సాధించడానికి కూడ వికృతిదర్శనం, రచనా సామర్థ్యం అవసరం అని మరువరాదు.

"యానేవ శబ్దాన్ వయమాలపామః
యానేవ చార్థాన్ వయముల్లిఖామః
తైరేవ విన్యాస విశేష భవ్యైః
సమ్మోహయన్తే కవయో జగన్తి."

# సాహిత్యగోష్ఠి

## దేశభాషల్లో బాలసాహిత్యం

స్థూలంగా బాలసాహిత్యం రెండు విధాలు — (1) బాలురు తాముగా చేసే రచనలు. (2) బాలురకై పెద్దలు వ్రాసేవి.

మొదటి రకం సాహిత్యం బాలుర సృజనాత్మక శక్తిని వెలికి; తీస్తుంది. వారున్న వాతావరణంలో వారి అనుభవ పరిధిలోకి వచ్చే వ్యక్తులను గురించి వారను కొన్నది అప్పటికప్పుడు అభివ్యక్తం చేస్తే బాలుర మనః ప్రవృత్తులను. వారి కల్పనా శక్తిని బుద్ధి విశేషాలను తెలుసుకోవడానికి ఎంతో ఉపయోగపడుతుంది. అయితే బాలురు తమను అభివ్యక్తం చేయాలంటే వారికి సంపూర్ణ స్వేచ్ఛ అవసరం. తమను పెద్దలు కనిపెడుతున్నారన్న భావం వారికి కలగకుండా జాగ్రత్తపడాలి. బాలురకు ప్రారంభదశలో – అంటే శైశవ దశలో సన్నివేశాలంటూ వేరే ఉండవు. వారికి తారసిల్లిన వ్యక్తులే సన్నివేశాలు కూడ అవుతారు. అంటే పిల్లలు తాము ఏ పరిసరాలలో ఉన్నారో ఆలోచించరు. ఆలోచించే శక్తి వారికి ఉండదు. కనుక వారి ఎదుటకు వచ్చిన వ్యక్తిని గురించి తిన్నగా ఒక ముద్ర ఏర్పడుతుంది. ఆ ముద్రే వారి అభిప్రాయం. అయితే పరిసరాలు - అంటే ఇతరులు వారిపై ఏ మాత్రం ప్రభావం కల్గించినా ఆ ముద్రను బాలుడు యథాతథంగా వ్యక్తం చేయలేడు. ఉదాహరణకు ఒక బాలుడు కొన్ని జంతువులను చూచి ఉంటాడు. అందులో ఎలుగుబంటి కూడ ఉంటుంది. కొంతకాలం తరవాత ఆ బాలుడు ఒక వ్యక్తిని చూస్తాడు. చూడగానే ఎలుగుబంటి ముద్ర అతని మనః ఫలకంపై ఏర్పడుతుంది. ఆ మనిషి ఎలుగుబంటి అన్నభావం ఎప్పటికీ అలా ఉండిపోతుంది. అతనికి స్వేచ్ఛ ఉంటే తనలో ఏర్పడిన ఆ ముద్రను యథాతథంగా వ్యక్తం చేయడానికి జంకడు. కాని పక్కన ఉన్న వ్యక్తులు ఆ మనిషిని నీ పినతండ్రి అనో, మామయ్య అనో పరిచయం చేస్తే ఆభావం వ్యక్తం కాకుండా ఉండి పోతుంది. ఆ మనిషి చేష్టలు మొదలయినవి అతనికి ఇష్టంకాకపోయినా వాటిని పైకి అనలేకపోతాడు.

బాల్యావస్థకు వచ్చేటప్పటికి బాలునిలో కల్పనాశక్తి పెరుగుతుంది. పరిసరాల్ని గ్రహిస్తాడు. వ్యక్తులను పరిసరాలతో కలిసి గ్రహించడం క్రమంగా అతనికి అలవాటు అవుతుంది ఆదశలో తానువిన్న చూచిన విషయాలకు చిలవలు పలవలు పెంచివ్యక్తం చేయగల్గుతాడు. ఇక్కడ పెద్దలకు–పిల్లలకు ఒక తేడా ఉంటుంది. పెద్దలకు ఒక కథలో వాస్తవమేది? తాము చేసిన కల్పనఏది? అన్న భేదజ్ఞానం ఉంటుంది. పిల్లలకు అలా ఉండదు. వాస్తవంతో తాము కలిపి చెప్పిందంతా వారికి యదార్థంగానే కన్పిస్తుంది. తాముకూడ అందులో ఒక పాత్ర అయిపోతాడు. రాజకుమారుడు రాక్షసునితో యుద్ధంచేస్తుంటే తానూ అతని ప్రక్కన నిలబడి యుద్ధం చేస్తాడు. ఆసమయంలో రాజకుమారుడు రాక్షసుణ్ణి కొడితే తానూకొడతాడు. రాజకుమారుడికి దెబ్బలు తగిలితే ఆతగిలిన బాధను తానూ అనుభవిస్తాడు. ఈదశలో తగినంత అభివ్యక్తి స్వాతంత్ర్యం కల్పిస్తే ఎన్నో అందమైన రచనలు బాలురు చేస్తారు. అవి గీతాలరూపంలోనూ ఉండవచ్చు. కథల రూపంలోనూ ఉండవచ్చు. దృశ్యరచనలుగానూ ఉండవచ్చు. వారు చెప్పిన ఆ రచనలను ప్రచురిస్తే ఎన్నోసత్ఫలితాలు సంభవిస్తాయి. బాలురలో ప్రాణి సహజమైన అభివ్యక్తి మనిషిలో మరింత తీవ్రమైన స్థితిలో ఉంటుంది. దాన్ని ఏరూపంలో అడ్డుకున్నా అది అతని భవిష్యజ్జీవితానికి హానికలిగిస్తుంది. నాగరకసమాజం నుండి వచ్చినవారుకూడ సంఘవిద్రోహ కార్యకలాపాలకు పాల్పడటం ఈకారణంవల్లనే అని చెప్పవచ్చును. బాలుర మనోభావాలు వెల్లడికావడం జరిగితే

వారి సృజనాత్మకత పదునుతేరి జీవితంలో సాఫల్యాలను సిద్ధింపజేస్తుంది. ఆధునిక విద్యావిధానంలో వస్తుపరకమైన నిర్మాణానికి స్థానం కల్పిస్తే బాలురు మంచి సైన్టిస్టులు కాగలరు. మంచి ఇంజనీర్లు కాగలరు. డాక్టర్లు కాగలరు. కాని మంచి మనుషులు కాలేరు. అయితే వస్తుపరక నిర్మాణంతోబాటు లలితభావాభివ్యక్తికి కూడ దోహదంకల్పిసే అది ప్రదర్శితం, ప్రకటితం అయితే సైన్టిస్టులు ఇంజనీర్లు, డాక్టర్లు మంచి మనుషులుకూడ అవుతారు. ఇందుకు ప్రత్యేకం - బాలురరచయితల వర్కుషాపులు ఏర్పాటు చేయించాలి. ఎనిమిదేళ్ళనుండి పదమూడేళ్ళ బాలురకు వేరుగాను ఆపైన 19ఏళ్ళవరకు బాలురకు వేరుగాను ఆవర్కుషాపులు జరగాలి. వాటిలోగేయం, కథ, నాటికలు మొదలయిన ప్రక్రియలద్వారా వారిరచనాశక్తుల్ని బయటకు తీయవచ్చు. ఆవర్కుషాపుల్లో జరిగిన రచనలను సంపుటాలుగా ప్రకటించవచ్చు. ఇంతేగాక చాలా రచయితల రచనలకు మాత్రమే చోటునిచ్చే పత్రికలు, పుస్తకాలు ప్రచురితం కావాలి. అవి ఎక్కువమందికి అందేటట్లు ప్రయత్నం జరగాలి. ఇందుకు ధనలోపం అడ్డురాకూడదు. ఇది చాలా సత్ఫలితాల నిస్తుందనడంలో సందేహంలేదు.

రెండవది బాలురకై పెద్దలు రాసేసాహిత్యం. నిజానికి ఈనాడు ఈసాహిత్యమే బాలసాహిత్యంగా ఎక్కువగాచలామణి అవుతోంది. అయితే ఈ పెద్దలు రాసేదంతా బాలసాహిత్యమూకాదు. వీరు బాలసాహిత్య రచయితలూకారు. వీరిలో ఎక్కువమంది సాధారణంగా పెద్దలకు సంబంధించిన సాహిత్యాన్ని సరళమైన భాషలోరాసి బాలసాహిత్యంగా చలామణీచేస్తున్నారు. రామాయణం, భారతం, బృహత్కథ పంచతంత్రం, హితోపదేశం, విక్రమార్కకథలు, బీరబల్ కథలు మొదలయిన వాటిని, ఇటువంటివే అయిన ఇతర సాహిత్యాంశాలను సరళమైనభాషలోరాసి ప్రకటిస్తున్నారు. వీరి రచనలను మనం 'సరళీకృత సాహిత్యం' అని అనవచ్చు.

దీనివల్ల బాలురకు మేలుజరుగదు సరికదా అపకారం జరిగేఅవకాశం ఎక్కువగా ఉంటుంది. ఉదాహరణకు రామాయణకథను తీసుకుందాం. ఆరామాయణకథలోని సన్నివేశాలు ఒకదానికొకటి శృంఖలాబద్ధములై ఉంటాయి. ఆకూర్పులో ఒక జటిలత్వం ఉంటుంది. కూర్పులోని జటిలత్వం ఆకథకు ప్రాణం. ప్రతి సన్నివేశంలోను, ప్రతిపాత్రలోను మంచి చెడ్డలు రెండూకలబోసి ఉంటాయి. దానిని అలాగే చదివి గ్రహిస్తే జీవితాన్ని గురించి మనం ఎంతో గ్రహిస్తాం. మనస్సుకు, బుద్ధికి శక్తి బలం చేకూరుతాయి. ప్రౌఢత్వం ఏర్పడుతుంది. సమయం వచ్చినప్పుడు దానివల్ల మార్గదర్శకత్వంకూడ లభ్యమవుతుంది.

కాని బాలలసాహిత్యం పేరుతో మనందాన్ని సరళంచేసి అంచేజటిలత్వాన్ని పరిహరించి పిల్లల ఎదుటపెడితే ఏమౌతుంది? రాముడు సీత అడవికి వెళ్ళడం, రావణుణ్ణి చంపడంవంటి స్థూలవిషయాలను వీరు తేలికగా గ్రహిస్తారు. అంటే, ఇలా తేలికైన విషయాలను చదువుతూ వారి బుద్ధి దానికే అలవాటుపడి పోతుంది. రానురాను గంభీరము, ప్రౌఢము, జటిలము అయిన విషయాలను గ్రహించడం కష్టమౌతుంది. సుకుమారమైనబుద్ధి కఠిన విషయాదులను గ్రహించలేదు. మనిషి ఎదిగినా బుద్ధి పన్నెండేండ్లలోనే ఉండిపోతుంది. చాలామంది ఎంత వయస్సు వచ్చినా చందమామవంటి పత్రికలను చదువుతూ ఉండటం, లేదాతేలిక పాటి కథలునవలలు మాత్రం చదువుతూ ఉండటం, ఆలోచనలను రేకెత్తించే ప్రౌఢగంభీరములయిన రచనల జోలికి వెళ్ళలేకపోవడం ఈకారణం వల్లనే అని చెప్పాలి. వాళ్ళ సాహిత్యవ్యాసంగం పొడుపుకథలు, తేలికపాటి కథలు గేయాలు పజిల్సు, జోక్సు, ఏవోచిక్కుప్రశ్నలు—వరకుమాత్రం పరిమితమైఉంటుంది. ఇటువంటి వారుజీవితంలోఎదురయ్యే ఏచిన్న సమస్యకైనాసరే త్వరగా అలసిపోతారు. వారిలో ఆత్మవిశ్వాసంతక్కువగా ఉంటుంది. పలాయనవాదం వారిలో ఎక్కువగా ఉంటుంది. జీవితాన్ని ధైర్యంగా ఎదుర్కోలేరు వారు.

కనుక ప్రౌఢసాహిత్యాన్ని సరళంచేసి వ్రాయడమనే ప్రక్రియను పూర్తిగా వదలివేయవలసిన అవసరం ఎంతో ఉంది. ప్రౌఢసాహిత్యాన్ని ప్రౌఢరూపంలోనే చదవాలిగాని సరళంచేసి చదవకూడదు. రామాయణం, భారతం, బృహత్కథ వంటి వాటిని జటిలత్వం లేకుండా రాస్తేనే బాలురు అర్థం చేసుకొంటారనేభావం సరికాదు. పదిపన్నెండేళ్ళ వయస్సువచ్చిన వారు వాటిని మూలరూపంలోనే గ్రహించగలుగుతారు. సందేహంలేదు. ఒకసారి సరళంచేసి తరువాత జటిలరూపాన్ని అర్థంచేసుకోమంటే మాత్రం కష్టమౌతుంది.

మరి రామాయణ భారతాదుల్ని వదలితే బాలసాహిత్య రచయితల గతి ఏమికాను ? అన్న ప్రశ్న ఉదయిస్తుంది. కల్పనాశీలి, శక్తి వంతుడు అయిన రచయిత భయపడ

వలసిందే లేదు. లలిత సాహిత్యాన్ని వదలి ఇతరమైన అనేక విషయాలను బాలసాహిత్యారూపంలో చెప్పవచ్చును. ఇక్కడ సరళం చేసి చెప్పిన దోషం ఉండదా ? అంటే ఉండదు. సైన్సు టెక్నాలజీ మొదలయినవి విద్యలు అంటే. క్రమక్రమంగా ప్రవేశాన్ని, నైపుణ్యాన్ని సంపాదించ వలసిన విషయాలు. వాటికి ఒక క్రమం ఉంటుంది. అ క్రమం సరళం నుండి జటిలం వైపు చేసే ప్రయాణంలో అనేక మజిలీలు ఉంటాయి. ఉదాహరణకు రసాయన శాస్త్రంలో వేరువేరు పదార్థాల గుణాలు వేరువేరుగాఉంటాయి. మొదటి వాటి జ్ఞానం ఏర్పడిన తరువాత రెండవ వాటిజ్ఞానం ఏర్పడటం అక్కడ అ సహజ మేమీ కాదు. అందువలన ఆయా విషయాలను బాలసాహిత్యం ద్వారా చెప్పడం లాభ దాయక మవుతుంది. పూర్వకాలంలో వైద్య విషయాలను పాటల ద్వారా పిల్లలకు నేర్పేవారట. మరి ఈనాడు భూగోళశాస్త్రము ఖగోళశాస్త్రము, వంటి అనేక జటిల విష యాలను సరళంచేసి చెప్పవచ్చు. పాటలు పద్యాలు కథలు, నాటికలు, రంజకంగా చెప్పాలి. జీవిత చరిత్రలు ఇలా విధా వాలుగా చెప్పవచ్చు. చెప్పాలి కూడాను.

సాహిత్యం జటిలమయిన జీవితాన్ని సరళం చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక అదే క్రమంలో దాన్ని చదవాలి. సాహిత్యం ఎంత ఉదాత్తతకు చేరుకుంటే అంత సరళంగా ఉంటుంది. సైన్సు, టెక్నాలజీ మొదలయినవి సరళమైన జీవితాన్ని జటిలం చేస్తాయి. కనుక వాటిని అదే క్రమంలో నేర్వాలి. "సాక్షరా విపరీతాః చేత్ రాక్షసా ఏవ కేవలం" అన్నారు. సాక్షరులు అంటే చదువుకున్న వారు విపరీతమైతే రాక్షసు లౌతారట ! సాహిత్యంలో ఈ క్రమం విపరీతమైతే ఎన్నయినా జీవితమంతా విపరీతమే అవుతుంది.

చిర్రావూరి సుబ్రహ్మణ్యం
పరీక్షా విభాగ కార్యదర్శి,
దక్షిణ భారత హిందీ ప్రచార సభ,
త్యాగరాయనగర్, మద్రాసు.

# వర్తమాన సమాజ దర్పణం ఆకలి నృత్యం

## శ్రీమతి శీలాసుభద్రాదేవి కవితా సంకలనం

గొప్ప కవిత్వానికుండాల్సిన లక్షణాలు సమకాలీన సామా జిక పరిస్థితులనుబట్టి నిర్ణయమవుతాయని అనుకుంటాను. ఒకప్పుడు మహారాజుల కథలూ, మరొకప్పుడు స్త్రీ అంగాంగ వర్ణనలతో ప్రబంధాలూ, యింకొకప్పుడు వైయ క్తికమైన భావలోలతతో రాసినకవిత్వం, గొప్పకవిత్వాలుగా చెలామణి అయాయి.

ఏ సాహిత్య ప్రక్రియకయినా వస్తువు, రూపం అనేవి రెండు కళ్ళలాంటివి. వస్తువేదయినా ఫరవాలేదు. అది కవిత్వమైతే చాలు అనేవాళ్ళు ప్రజలకి హానిచేసే కవిత్వాన్ని పరోక్షంగా ప్రోత్సహించడం జరుగుతూంటుంది. వస్తు ప్రాధాన్యత తర్వాత రీతి, రూపం యీరెండూ సమపాళ్ళతో కలిస్తేనే గొప్ప కవిత్వం అవుతుందని అనుకోవాలి మనం.

శ్రీమతి శీలా సుభద్రాదేవిగారి కవితా సంకలనం 'ఆకలి నృత్యం' లోని కవితల్ని చదివితే పైన చెప్పుకొన్న నిర్వచ నానికి చాలా దగ్గర్లో సుభద్రాదేవి గారి కవిత్వం వుందని పించింది. ఈ కవితా సంకలనంలో "సంప్రదాయపు తాళ్ళతో చైతన్యం కాళ్ళు కట్టిపేయబడ్డం స్త్రీల స్వేచ్ఛ, మతమౌఢ్యం, ఆచారాల మూర్ఖత్వం, కలగలిసిన యీ జాతికి అవసరమయిన దయాలిసిస్, పట్నాల దోపిడీకి గురవుతూన్న పల్లెటూళ్ళు, ఎన్నికబుర్లు చెప్పినా నడివీధిలో సమాజం నిర్లక్ష్యపు మధ్యాహ్నపుఎండలో గజ్జెకట్టి వికృ తంగా నృత్యంచేస్తున్న ఆకలి, "తరతరాలుగా అధికారానికి అహంకారానికీ తలవంచుతున్న" ఆడపిల్లలు, కవితా వస్తువు లుగా కళాత్మకంగా దర్శనమిస్తాయి. ఆలోచనల కందిరీగ తుట్టని ఒక్క కుదుపు కుదుపుతాయి. ఇదిగాక, కబంధుల రాజ్యంలో పక్షికూన సైతం రూపాన్ని మారుస్తున్న వైనం, పరిష్కారంకాని, రకరకాల సమస్యలతో చిక్కశల్యామైన దేశదుస్థితికి ప్రతీకలుగా ఒంటిమీద పేలికలతో దేశమాత విశ్వరూపం, మార్పుని వ్యక్తికాదు. 'ఉప్పెన' లాంటి సమ్యక్ శక్తి కావాలన్న నిజం యీ కవితల్లో కనిపిస్తాయి. రోమాలు నిక్కబొడుచుకుంటాయి.

ఈ సంకలనంలో కొన్ని కవితల్ని దగ్గరగా పరిశీలిస్తే

అనిపిస్తోంది. జనంలోని అజ్ఞానపు అంధకారాన్ని, మత మౌఢ్యాన్ని ఆచరాల మూర్ఖత్వాన్ని పోగొట్టడానికి మొద లంటా చికిత్స జరగాలి. కొత్తరక్తం కావాలి. విజ్ఞానం సహాయంతో, హేతువాదధోరణిలో పూర్తిగా జనంచైతన్యవంతులు కావాలి. అప్పుడే మానవత్వం గలజనం తయారవుతారు అటువంటిది. సోషలిస్టుసమాజంలోనేసాధ్యమవుతుందన్న భావన 'దయాలిసిస్'లో అన్న మాటల్లో

"నా పేరు జనం
నావాద సోషలిజం

పొందు పరచారు.

'మనసు ముద్రలు' అనే కవితతో బానిసత్వానికి వ్యతిరేకంగా దివిటీ ఎత్తిపట్టిన భావాలు.

"వట వృక్షపు నీడలో సేదతీరే చివ్నారి గడ్డి మొక్కలు కాదు.
నేనే ఒక వట వృక్షాన్నై
ఠీవిగా నిలవాలని"
"సూర్యుడి వెలుగుల్ని అద్దుకుని
నవ్వే చంద్రుడిలా కాదు
నేనే ఒక సూర్యగోళమై
స్వయం ప్రకాశంతో జగతినిండా వెలుగు నింపాలని"

అనే వాక్యాల్లో కనిపిస్తాయి.

'ఆకలి నృత్యం' కవిత నిజంగా గుండెల్ని పిండెయ్యగల కవిత

"ఆకలితో పేగులు అరచినట్లుగా వుంది,
ఎలుగు రాసి పోయిన ఆపాట
పైసా కోసం కన్ను కొడుతున్న ఆ పసిపాప
వెయ్యి చేతులతో, వెయ్యి కాళ్ళతో
అన్ని కాళ్ళకి గజ్జెలతో
విశ్వరూపంతో
ఆకలే నృత్యం చేస్తున్నట్లుంది
గుండెల్ని బద్దలు చేస్తోంది"

అన్న వాక్యాలు చదివితే ఆకలిరూపం కళ్ళకు కట్టినట్లు అనుభూతి కలుగుతుంది. గుండె బద్దలయినంత బాధకలుగుతుంది.

"కబంధుల రాజ్యం'లో ఆనేకవితలో రాజకీయ నాయకుల్ని 'కబంధులతో సరిపోల్చడం పెట్టుబడి దారీసమాజంలో ప్రతివాడు స్వార్థపరుడిగా తోటి మనిషిని దోచుకునే వాడిగా తయారవుతాడన్న ధ్వని మనకి కనిపిస్తుంది.

'దేశమాత' అనే కవితలో దేశపటాన్ని చూస్తూ,

"కన్యాకుమారి అగ్రంలాంటి
సూది గడ్డం గుచ్చుకుని
ఓ క్షణం నిలిచి
నదీ రేఖల్లాంటి ముడుతల్లో పడిలేస్తూ
ఎలాగైతేనేం చూపు
దక్కను పీఠభూమిలా
కొంచెం ఎత్తుగా వున్న చెంపల మీది కెక్కింది
రాజస్థాన్ ఎడారి లాంటి
తడిలేని గాజు కళ్ళలోకి
తొంగి చూడలేక దాటేసింది
గంగాతీర మైదానపు నుదుటిపై
ఏనాడో పొడిపించుకున్న పచ్చబొట్టు
మ్యాపు మీద గుర్తించిన ఢిల్లీలావుంది"

అనడంలో అప్రతిహతమైన కవితాశక్తి కనిపించి ముగ్ధుల్ని చేస్తుంది.

'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీ లెవ్వరు? అన్న మహాకవి మాటల్లోని భావం మరింత సరళంగా 'సర్వజీవి' అనే కవితలో కనిపిస్తుంది.

'మధ్య తరగతి జీవి' అనే కవిత మాత్రం ఆదే విషయ వస్తువుతో రాసిన తిలక్ 'గొంగళీలు' ఆనే కవిత ఆరుద్ర క్లార్క్ సూర్యారావు' కవితల స్థాయిని చేరలేకపోయింది.

"బడ్జెట్‌గాలి వీచినపుడు
వస్తువులన్నీ అంటుకుంటాయి
ఐకమత్యంతో మండిపోతాయి
ఫలానా వస్తువు మండిపోవడం తప్పదని
అమ్మకపు దార్లకెట్లా తెలుస్తుందో మరి!"

అనే వాక్యాలోని భావనాపటిమ 'బజార్లో మంటలు' కవితలో మనల్ని తట్టిలేపుతుంది.

మొత్తానికి 'ఆకలినృత్యం' కవితా సంకలనంలోని యించుమించు అన్నికవితలా అభ్యుదయకరంగా శిల్పసముదాయంతో గుభాళిస్తున్నాయి. మస్తిష్కంలోని, ఆలోచనల బూజుని దులుపుతున్నాయి. ఏకవిత చదివినా యిప్పుడు కవిత్వం యింత సుళువుగా, యింత అందంగా చెప్పొచ్చా' అనిపిస్తుంది.

ఈ కవితలో 'స్మృతి పుష్పం' 'జీవిక్రోత' 'ఘంటసాల'

అనే కవితలు మాత్రం స్వీయాత్మకంగా వున్నాయని పించింది. అయినా వాటిలో మార్దవం ఆకట్టుకుంటుంది.

సామాన్య జనానికి అర్థమయ్యేరీతిలో అసామాన్యంగా వున్న ఆధునిక కవిత్వంరుచి తెలియాలంటే ఈకవితా సంకలనం చదవాలి.

పీఠికలో శ్రీ శివారెడ్డి అన్నట్టు సుభద్రాదేవి గారి కవితలో ఆగ్రహం. అంతర్లీనంగా వున్న ఒక ఆర్ద్రత, కవిత్వమంతటా పాకిపోతుంది. ఆమె కవిత్వం కూడా ఒక దుఃఖం, ఒక వేదన, ఒక ఆర్తి మూర్తికట్టుకుని కనిపిస్తాయి. నిజంగా ఆమె కవిత ఎటువంటి పటాటోపమూలేని కవిత.

జి.యల్ .యన్. స్వామి
స్వామినిలయం
గాంధీనగర్
బరంపురం.
760001

# సోమసుందర్ కవితాలహరి

ఆధునికాంధ్ర సాహిత్యా కాశంలో వినూత్నకాంతులు ప్రసరింప చేస్తున్న ద్యుమణి సోమసుందర్. కవితా ప్రతిభోత్సవంలో ఆహరహంగావినిపిస్తున్న కలకంఠం. గురజాడ వెదజల్లిన వెలుగు జాడ విరజాజుల సుతారపు పరిమళాలు ఆఘ్రాణించి, నడిచే అగ్ని పర్వతం లాంటి చలం అండగా చేసుకుని, రవీంద్ర కవీంద్రుని కవితామృత వర్షధారల్లో తడిసి, కృష్ణశాస్త్రి వలపూ పిలుపూ గుండె నిమిరి కన్నీళ్ళు తుడిచి సంయమనం నేర్పింది. లోక సాక్షాత్కారంపొందాడు. శ్రీశ్రీలో మహాశక్తి కనిపించింది. ఖగేక్షణా చాతుర్యం అలవడటమేకాదు. విప్లవానికి ఆవాహన చేస్తున్న క్రియాశీలి. కార్యోత్సాహికూడా. భవిష్య దుజ్వలగగనంపై సప్తవర్ణ దీధితిమయ మహేంద్ర చాపాన్ని ఆవిష్కరిస్తున్నాడు భగవద్గీతకు కృష్ణునిలా ఈ యుగానికి షుకుటధారినంటున్నాడు.

నేనే కర్తను భోక్తనినేనే
నేనే స్రష్టని - సృష్టిని నేనే
నవలోకానికి సుదర్శన చక్రధారిని నేను.

సోమసుందర్ కవిత్వంఆలోచనామృతకవితారసాయనం వర్తమాన సమాజంలో దుర్మార్గానికి దురహంకారానికి రాక్షసత్వానికి వున్నస్థానం మంచికిమానవతకు లేదు. దోషభూయిష్టమయిన సమాజాన్ని వెలికి దీసి చూపుతోంది ఆనలకిరీటం కవిత. ఉద్ధరించమని శాంతి మాతను వేడుకుంటున్నాడు.

మంచికి మానవతకు నీకు
అనల కిరీటం తొడిగాడు నరుడు
వాడుదానవుడికీ వానరుడికీ వారసుడు
దుశ్చింతకూ దుర్మార్గానికీ కుమారుడు.

నేటికాలపు భారతదేశాన్ని పదోయీత తాలూకు బడుగు గొడ్డులాగుందట. పారిశుద్ధ్యం విషయంలో భారతీయులకు అశ్రద్ధ నైపాల్ వంటివారంతా విమర్శిస్తూ గ్రంథాలురాశారు. సోమసుందర్ కూడా అదేఅంటున్నాడు. నూతనవ్యవస్థా విర్భావసూచన చేతన్ స్పర్శ. నీరవనిశాగర్భం నేటిధన స్వామ్యవ్యవస్థ తలదూర్చి వెలికిరాలేక తన్నుకుంటూన్న

ఆడుజింకలామానవత
ప్రగంపిస్తోంది తూరుపు చూలింత
కడుపులోని ప్రత్యూషం.

నీరవనిశా గర్భంనుంచి ప్రత్యూషం బయటపడటం ధనస్వామ్యవ్యవస్థనుండి సామ్యవాదవ్యవస్థ ఉద్భవించడం.

మానవ మంత్రం కవిత ఒక ఉజ్వలగేయం. సకలకల్మషాకీర్ణం చిందరవందర చేయటానికి అడుగుపొరల (పీడిత వర్గం) నరులంతా నవరుధురులై చీల్చరండి, కాల్చరండి అని సమరోన్ముఖుల్ని చేస్తున్నాడు.

లేచిరండి వైశ్వానర
దీప్తులుగా కీలలుగా
త్రెంచుకోండి నిగళాలను
ధనస్వామ్య కృతకాద్రుల,
స్వార్థపర్వతాగ్రాలను
పేల్చిరండి ......దైవమేట్లు.

సోమసుందర్ చిత్తశుద్ధికి, లోకప్రమేయతకూ ఇంతకన్నా నిదర్శనం అక్కరలేదు. కవిత్వం సంకేతనిబద్ధం అందుకే ఆలోచనామృతం అన్నారు. రసందానికి ముఖ్యం. కవిత్వం చదివినప్పుడు ఆనందం కలగాలి. అనుభూతి పొందాలి. అలగాజనం దుర్భరజీవితాన్ని కవితావస్తువులుగా చుట్టూఅలముకొన్న చీకటి ఎంతభయానకంగా, క్రూరంగా వుందో, సగటుమనిషి పరిస్థితులను తట్టుకోలేక ఎట్లాకొట్టు

మిట్టాడుతున్నాడో నవనవోన్మేషంగా, చక్కని భాషలో. చిక్కని పదచిత్రాలతో అభివర్ణిస్తాడు. వంచనామయ జగత్తును తీవ్రభాషలో విమర్శిస్తాడు.

యెంగిలాకులు పతాకసంకేతలైన
క్షామార్తదేశానికి మృష్టాన్నసృష్టిని.

అనడం చక్కని భావం. బైరాగి తన కవిత్వాన్ని గురించి చెపుతూ,

కవితాసత్యం వెనుక యెంగిలి విస్తళ్ళకొరకు వెదుకను నేను' అన్నారు అది బైరాగిశపథం.

'ఇది సుదీర్ఘ చరమరాత్రి' కవితలో నిరాశావాదం కనిపిస్తుంది. కవి ఈ కవిత ఏ స్థితిలో రాసిందో వివరణ యిచ్చాడు. ఆశనిరాశలు హృదయజ్యోతి యడ పెరలుగా సంభవించే వెలుగునీడలని కవిగారే వాకొన్నారు. ఉత్తమ కవిత అనడంలో సందేహం లేదు. పరిపూర్ణస్థితిని తెలుపు

సర్వకాంతి సాంద్ర కిరణశకలముగా రూపుదాల్చి
నేత్రజ్యోతిగ మారెను. నాహృద్గతనాదమాయె
విశ్వమహోద్ధృతనాదం : నిశ్శబ్దంతాండవించె

ఆధ్మాతికపరంగా కూడా వ్యాఖ్యానించవచ్చు. రూపు చూపు ఏకమైపోయింది. అప్పుడేపూర్ణత్వం. విశ్వమహోద్ధృత నాదంతనలో వినిపించింది. తరువాత నిశ్శబ్దం తాండవించింది. ఈస్థితి పొందినవారికి రాత్రిపగలే అవుతుంది.

అద్భుత సౌందర్యవర్ణన, లోకోత్తరభావన ఈకవిలో ప్రతిపంక్తిలో దర్శించవచ్చు.

నిజమైన కవిత్వం ప్రజాకవిత్వం. మానవునిమీద మానవత్వం పట్ల అచంచల విశ్వాసం, దయ, ప్రేమ. వ్యక్తపరిచాడు. అమానవుడు సామాన్యుడు. ఉదాహరణకు :

వినిర్ముక్త జలదజాల వియన్మధ్యాంతరాన
అంగారకా సహితుడైన అరుణార్కునికైవడి
అసామాన్యంగా ప్రభావిస్తాడు,
సామాన్య మానవుడే.

'క్షామపీడిత జనహృదయం లాగుంది నాహృదయం' అనడంలో రూపకోత్ప్రేక్షలో నూతనత్వం, ప్రౌఢత్వం కనిపిస్తాయి. తెలుగుదేశానికి యెన్నో కవితాసంపుటాలు వెలువరించి కవితాక్షేత్రాన్ని సుసంపన్నం చేశారు. భజనపరత్వంగాని కిరాయితత్వంగాని కానరావు. అపారమయినపాండిత్యం ఆధ్యయనఆభ్యాసం ప్రతిభ వున్నకవి. భాషవ్యవహారికము గ్రాంధికమూల సమ్మేళనం. విశిష్టశైలి. క్రొత్తాకారు వంటి పదాలు కనిపిసాయి.

**వి. శివలింగం**
చల్లపల్లి. దివితాలూకా
కృష్ణాజిల్లా. 521126




# మధునాపంతుల సాహిత్య వ్యాసాలు

రచన- మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి
వెల- 10-00
ప్రతులకు- రచయిత పేర
త్యాగరాజనగరం, రాజమండ్రి-1

మధునాపంతులవారు జగమెరిగిన బ్రాహ్మణులు. వారు మహాకవిగానే కాక సద్విమర్శకులుగా కూడా ఆంధ్ర సాహిత్య జగత్తులో ఉత్తమమైన, ఉన్నతమైన స్థానం గడించారు. ఈ గ్రంథంలో ఆంధ్రమహాభారతము- వచనోపక్రమము, నన్నయ తిక్కనల అవతారికల తెన్నులు, నన్నయ తిక్కనల గద్యపద్యములు, నన్నయగారి వెన్నెలరేయి, శ్రీనాథుని కవి సార్వభౌమత, తెలుగు వ్యాసము- తద్వికాసము, వేదము వారి వ్యాఖ్యలు, విశ్వనాథవారి వచనశైలి మొదలైన పదకొండు వ్యాసాలున్నాయి. వ్యాసాలన్నీ భారతి, ఆంధ్రప్రభ మొదలైన పత్రికలలో ప్రచురించబడినవీ, ఆకాశవాణిలో ప్రసారం చేయబడినవీ, సభలలో ప్రసంగం చేయబడినవీ ఐ యున్నాయి. ప్రతి వ్యాసమూ సత్యనారాయణ శాస్త్రిగారి ప్రతిభకు నికషోపలాలు.

ఆంధ్రభారతము- వచనోపక్రమము, నన్నయగారి వెన్నెలరేయి, తెలుగువ్యాసము- తద్వికాసము వారి వికాసము వారి వ్యాఖ్యలు అనే వ్యాసాలు సత్యనారాయణ శాస్త్రిగారి విద్వత్తునూ, బహుముఖీన ప్రజ్ఞా విశేషమునూ, పరిశీలన ప్రవీణతనూ వెల్లడిస్తున్నాయి. సరళమూ, సరసమూ ఐన శాస్త్రిగారి శైలి సహృదయులను రంజింపజేస్తుంది. వారి శైలీ విన్యాస విలాసానికి ఈ క్రింది భాగము మచ్చుగా తీసుకొనవచ్చును.

"శారదరాత్రులు" అను ఉత్పలమాలలో జుట్టుకొని నన్నయగంటము మఱి కదలలేదు. అరణ్యము పూర్ణముగా నతడు రచియించియే యుండలేదు. ఇది యందఱివలె నేను పరిశోధన వైభవమున నిశ్చయించుకొన్న యభిప్రాయము కాదు. అనుభూతి ప్రాభవమే యీ నిర్ణయమునకు ఆవలంబమైనది. ఈ నా యనుభూతి పెద్దలముందు పఱచెదను. దానితో గాని ఆనందముతో నిండిన నా గుండె బరువు తేలికపడదు."

# గుడ్ మార్నింగ్

రచన- రావి రంగారావు
వెల- 8-00
ప్రతులకు- రచయిత పేర
తెలుగు లెక్చరర్
ఆంధ్ర జాతీయ బోధనా కళాశాల
మచిలీపట్టణం- 521 001

ఇది 44 మినీకవితల సంపుటి. కవి రంగారావుగారు భావుకుడైన విద్యావంతుడు. మినీకవితాభిమాని.

వీరు మినీకవితా విశిష్టతనూ, విలక్షణతనూ, లక్షణాలనూ వివరిస్తూ ఇదివరలో ఒక చిన్న పుస్తకాన్ని కూడా ప్రకటించారు. తాము వ్రాసి లక్షణానికి లక్ష్యమా అన్నట్లు ఈ కృతిని సంతరించారు. ఇందులోని ప్రతి కవితా కవి చిత్తశుద్ధినీ, సామాజిక స్థితి గతుల అవగాహననూ వెల్లడిస్తున్నాయి.

"పూర్వం బియ్యంలో
అక్కడక్కడ రాళ్ళుండేవి
ఇప్పుడొచ్చే బియ్యంలో
అసలుకన్న
రాళ్ళే ఎక్కువ
మన దేశంలో
మనుషులకన్న
దేవుళ్ళే ఎక్కువ కదా"

(వ్యాపారం)

అనేకవిత కవి సామాజిక దృష్టికి అద్దం పడుతున్నది.

"ఆకాశం యిచ్చింది
ఆకుల్ని;
చీకటి తెచ్చింది
వక్కల్ని;
వెన్నెల కలిపింది
సున్నం;
తాంబూలం వేసుకుంది
సముద్రం
పొద్దునే పలకరించాడు
భానుడు నవ్వుతూ,
సముద్రమూ నవ్వింది
పండిన నోటితో"

(గుడ్‌మార్నింగ్)

ఈ కవిత ఒక సుందర దృశ్యాన్ని మన కళ్ళ ముందు సాక్షాత్కరింపజేస్తున్నది. వ్యంగ్యగంధాన్ని. గుభాళింపజేస్తున్న ఈ క్రింది కవిత కవి ప్రతిభకు పతాక.

"పిల్లలు పాడితే
బాలవాణి
యువకులు మాట్లాడితే
యువవాణి
పెద్దమనుషులు పన్యసిస్తే
ఆకాశవాణి"

(హాస్యవాణి)

"రాత్రివేళ ఈ భూమి వెన్నెల తెల్లచీరమాటున దిగుళ్ళ నీడల్ని దాచుకొని మౌనంగా రోదిస్తోంది మళ్ళీ కళకళలాడాలంటే ఉదయం తిలకం దిద్దాలి" (పునర్వివాహం) ఈ కవిత కవి భావనాశక్తికి మచ్చుతునక.

'ప్రజాస్వామ్యం' 'ఆశ' 'బతుకు' మొదలైన కవితలు రంగారావుగారి ప్రతిభకు చక్కని తార్కాణాలు. ఈ సంపుటిలోని ప్రతి కవితా వ్యంగ్యమూ, సామాజిక స్పృహ, అవినీతిపై కవితా కరవాలపు ఝళిపింపులూ చక్కగా చూపెడుతున్నాయి.

చేతివ్రాతను బ్లాకులు చేయించి, చిత్రాలతో పుస్తకాన్ని అచ్చువేయించి ముద్రణలో క్రొత్తదనం చూపించారు.

— వేముగంటి

# వార్తా వాహిని

**దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర, హైదరాబాద్-500 004.**

**స్వర్ణోత్సవాలు-1986.**

(డి. 26-6-1983 నాడు హైదరాదులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర కార్యా నిర్వాహక వర్గ సమావేశంలో 1986లో ఆంధ్ర సభ స్వర్ణోత్సవాలు జరుపవలెనని తీర్మానించి అందు నిమి త్తం ఒక కార్యక్రమం అంగీకరించినది. స్వర్ణోత్స వాల కార్యాక్రమం క్లుప్తంగా ప్రకటిస్తున్నాం. విశేషా ధికారికి వ్రాసి యిందుకు సంబంధించిన వివరాలు హిందీ పండితులు. ప్రచారకులు తెప్పించుకొన వచ్చు.)

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసుకు ఆంధ్ర శాఖగా 1936లో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘం, విజయవాడ పట్టణము నందు స్థాపిం చబడి ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్రగా రూపొంది హైదరాబాదు నందు ప్రధాన కార్యాలయం ఏర్పాటు చేయబడి 1986 నాటికి ఏభై సంవత్సరాలు పూర్తి కావస్తున్న విషయం సభ్యులకు విదితమే.

యీ సభ ఆంధ్రప్రదేశ్‌లో మాతృభాష తెలుగు, జాతీయ భాష హిందీ ప్రచారాభివృద్ధికై అనేక కార్య క్రమాలు అమలు పరచి మంచి పునాదులతో సువ్యవ స్థితమైన సంస్థగా రూపొంది ప్రగతి పధాన ముందుకు సాగుతున్నది. 1963లో సభ రజతోత్సవాలు అప్పటి భారత రాష్ట్రపతి కీ.శే, సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి అధ్యక్షతన విజయవంతముగా జరిగినది. కీ.శే. భారత రత్న లాల్ బహదూర్ శాస్త్రిగారుపై రజతోత్సవా లకు ప్రారంభోత్సవం జరిపి సభ అభివృద్ధికి ఎంత గానో సహకరించినారు.

1986లో ఆంధ్ర సభ స్వర్ణోత్సవాలు జరుపవలసి యున్నది. ఈ సందర్భంగా పన్నెండు లక్షల రూపా యల (రు. 12,00,000 ల) క్రింది కార్యక్రమములు సర్వుల సహకారంతో పూర్తి చేయవలసియున్నది.

## కార్యక్రమములు

1. హిందీ పరిచయ పరీక్ష
2. ఆదాన ప్రదానముః హిందీ గ్రంథ ప్రచురణః
3. సావనీరు ప్రకటన
4. స్వర్ణోత్సవ భవన నిర్మాణము
5. స్వర్ణోత్సవ మహాసభల నిర్వహణ

### కార్యక్రమాల వివరణ:-

**1. హిందీ పరిచయ పరీక్ష :-**

రెండు సంవత్సరాల ఆరు మాసముల సమయము నందు రెండు లక్షల మంది పరీక్షార్థులకు హిందీ పరి చయం కావించి పరీక్షా నడిపి ప్రమాణ పత్రములు అందజేయబడును. విద్యార్థికి ఐదు రూపాయల చొప్పున పరీక్షా రుసుము వసూలు చేయబడును. హిందీ పండితులు విద్యార్థులకు మాసము రోజులు శిక్షణ నొసంగెదరు. విద్యార్థికి పుస్తకం, హిందీ శిక్షణ ఉచి తంగా నొసంగబడును.

**2. ఆదాన ప్రదానము:-**

నాలుగు తెలుగు కథానికల హిందీ అనువాద సంపు టములు, నాలుగు తెలుగు నవలల హిందీ అను వాదము, ఆంధ్రకేసరి జీవిత చరిత్ర ఒకటి, తెలుగు

నాటకి హిందీ అనువాదం ఒకటి - మొత్తం పది గ్రంథములు యీ రెండున్నర సంవత్సరముల వ్యవధిలో ప్రకటింపబడును.

3. సావనీరు :-

నాలుగు వందల పేజీల సావనీరు ప్రపటించబడును. 120 పేజీలు సాహిత్య సాంస్కృతిక సభకు సంబంధించిన వ్యాసములకు, 150 పేజీలు 300 మంది పరీక్షార్థులను పరిచయం పరీక్షకు కూర్చోబెట్టిన వారి సచిత్ర పరిచయ ప్రకటనకు, 125 పేజీలు అడ్వర్టయిజ్ మెంట్లకు కేటాయించబడును.

4. స్వర్ణోత్సవ భవనము:—

హైదరాబాదులో సభా ప్రాంగణమునందు ప్రెస్ భవనం ప్రక్కనగల చోటునందు నాలుగు వాటాలతో కూడిన భవన నిర్మాణం చేయబడును. కార్యకర్తలకది నివాస భవనముగా నుండును.

5 స్వర్ణోత్సవ కార్యక్రమాలు

స్వర్ణోత్సవ కార్యక్రమాలు మూడు రోజులపాటు హైదరాబాదులో జరుపబడును. స్వర్ణోత్సవం, అఖిల భారత భాషా సభ,హిందీ ప్రచారకుల, సభ వర్కింగ్ కమిటీ మెంబర్ల, పెద్దల సన్మానం,సావనీర్, తెలుగు హిందీ గ్రంథముల ఆవిష్కరణసభ, సాంస్కృతిక కార్యక్రమములు, హిందీ కవి సమ్మేళనం మొదలుగా గల కార్యక్రమములు జరుపబడును.

స్వర్ణోత్సవ మహాసభల ఆదాయము 12 లక్షల రూపాయలు, వ్యయము 12 లక్షల రూపాయలుగా నిర్ణయించనైనది.

o

## అఖిల భారత హిందీ ప్రచార మహాసభలు

జనవరి 84లో హైదరాబాదులో జరుగుతాయి.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర ఆధ్వర్యాన జనవరి 1984లో హైదరాబాదునందు అఖిల భారత హిందీ ప్రచార మహాసభలు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర ఆధ్వర్యాన జరుపవలెనని, దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర కార్యనిర్వాహకవర్గం ది. 25-6-1983 నాడు జరిగిన సమావేశంలో నిర్ణయం గైకొన్నది.

స్వాతంత్ర్యం వచ్చి 35 సంవత్సరాలైనా రాజభాషగా రాజ్యాంగంలో హిందీభాషకు స్థానంలభించినా వాస్తవానికి ఆచరణలో అపని జరగడంలేదు. ప్రాంతాలలో ప్రాంతీయభాషల పరిస్థితికూడా ఇలాగే వున్నది. ఇంగ్లీషుభాష ప్రాబల్యం రోజురోజుకు పెరిగిపోతున్నది స్వతంత్రభారత దేశంలో రాజకీయ పరిస్థితులు మారిపోతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశంపార్టీ అధికారంలోకి వచ్చింది. పూర్తిగా వాతావరణం మారిపోయింది. యీ మధ్యన రెండుఏండ్లనుంచి ఆంధ్రప్రదేశ్ స్కూళ్ళలో భాషల అధ్యయనం పల్చబడిపోయింది. పీరియడ్లు తగ్గించివేశారు. భారతావనియందంతట దరిదాపుగా యిదే పరిస్థితిగా వున్నది యీ పరిస్థితుల్లో అఖిలభారతస్థాయిలో హిందీప్రచార మహాసభలు జరిపి ఆచరణయోగ్యమైన నిర్ణయాలు గైకొనదం అవసరమనితోచి ఆంధ్రసభ పైనిర్ణయం గైకొన్నది.

పై మహాసభలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 1000 మంది ప్రతినిధులకు అఖిలభారతావనికి చెందిన 1000 మంది ప్రతినిధులకు ఆహ్వానాలు వంపబడతాయి. హిందీప్రచార రంగంలో పనిచేస్తున్నవారికి ఎక్కువగా అవకాశం కల్పించబడుతుంది వారందరికి రైల్వే బస్సు కాన్సెషను తెప్పించుటకు కృషి జరుగుతుంది. రెండురోజులపాటు జరిగే యీ మహాసభల్లో భారత పధాని, లేక భారతరాష్ట్రపతి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖమంత్రి పాల్గొనేలా ప్రయత్నం జరుగుతుంది. సావనీరు ప్రకటిస్తారు

సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటుచేయబడుతాయి. ప్రారంభోత్సవం ముగింపుసభలు జరుగుతాయి. ఆంధ్రప్రదేశ్ మరియు భారతావనికి సంబంధించిన హిందీప్రచార, బోధనా సమస్యలపై విడివిడిగా సదస్సులు జరుగుతాయి యీ మహాసభలకు లక్షాయాభై వేల రూపాయలు ఖర్చు అవుతాయి. ప్రతినిధిరుసుం రు. 15-00 నిర్ణయించబడింది. ప్రతినిధులందరికి నివాసభోజన వసతులు ఆహ్వానసంఘం పక్షాన ఏర్పాటు చేయబడుతాయి. శ్రీ టోకర్సీలాల్ కపాడియా ఆహ్వాన సంఘం అధ్యక్షులుగాను, శ్రీ వేమూరి రాధాకృష్ణ మూర్తి ఆహ్వానసంఘ ప్రధాన కార్యదర్శిగాను ఎన్నుకోబడ్డారు. త్వరలోనే ఆహ్వానసంఘం పూర్తిగా ఏర్పాటుచేయ బడుతుంది. *

## తెనాలి హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ వెలువోలు సీతారామయ్యగారి అమృతోత్సవం

ది. 17-5-83 న తెనాలి హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ వెలువోలు సీతారామయ్య గారికి 75 సంవత్సరములు నిండిన సందర్భమున శ్రీ నన్నపనేని కళా మందిరంలో అమృతోత్సవం జరుపబడినది. ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ ఆవుల సాంబశివరావు గారు అధ్యక్షత వహించారు. అమృతోత్సవ సమితి ఉపాధ్యక్షులు డా. పి దక్షిణామూర్తి స్వాగతం పలికారు. విప్లవవీరుడు శ్రీ పోతరాజు రామమూర్తి గారు అతిథులను పరిచయం చేశారు. సమితి కార్యదర్శి శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు అమృతోత్సవ వివరాలతో నివేదిక సమర్పించారు. కోశాధికారి శ్రీ జి. సత్యనారాయణ గారు ముఖ్యమంత్రి గౌ॥ ఎన్.టి రామారావు మరియు కేంద్ర రాష్ట్ర మంత్రులు తదితర పెద్దలనుంచి వచ్చిన సందేశములను చదివి వినిపించారు. పెక్కు సాహిత్య సాంస్కృతిక సంస్థల తరపున సన్మానపత్రాలు సమర్పింపబడ్డాయి. నూతన వస్త్రాలు పుష్పమాలలు సాదరంగా సమర్పింపబడినాయి. అనంతరం శ్రీ సీతారామయ్య గారు కవి పండితులను పెద్దలను దుశ్శాలువలతో సత్కరించారు.

కళాతపస్వి డా॥ సంజీవదేవ్ సభను ప్రారంభించారు. తెనుగులెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి శ్రీ వెలువోలువారి 'జీవిత రేఖలు' ఆవిష్కరించి, వారు సాంఘిక, రాజకీయ, సాహిత్య, సహకార విద్యారంగాలలో చేసిన, చేస్తున్న సేవలను ప్రస్తుతించి, జాతీయ భాష హిందీవ్యాప్తికి చేయు కృషిని కొనియాడుతూ, కవితాత్మకంగా ఆశీర్వదించారు. దర్శనాచార్య డా॥ కొండూరు వీరరాఘవాచార్యులు, పండిత జమ్మలమడక మాధవరామశర్మ, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య, 'సత్యసుధీరత్న' శ్రీ యార్లగడ్డ రంగనాయకులు చౌదరి, సాహితీ విమర్శకులు శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు ప్రభృతులు శ్రీ సీతారామయ్యగారి చిత్తశుద్ధి నిష్కళంక దేశభక్తి నీతినిజాయితీలు, నిస్వార్థసేవా పరాయణత్వం పవిత్ర జీవితం పారమార్థిక చింతన గురించి వివరించి, వారి ఆదర్శజీవితం నేటి యువతరంలో నూతనోత్తేజం పూరించాలని అభిలషించారు.

సన్మానితుడు శ్రీ వెలువోలు సమాధానమిస్తూ వారు నేటి రాజకీయ కాలుష్యాన్ని గర్హించి, సేవాత్యాగములు ప్రధానంగా మానవసేవ చేయాలని పేర్కొని తమకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతాభివందనములు తెలిపారు

శ్రీ మన్నవ వెంకట నారాయణ గారు ధన్యవాదములు పలికారు.

సభానంతరం హిందీ ప్రేమీమండలి ఆవరణలో ఆహూతు లందరికి షడ్రసోపేతంగా విందు జరిగింది.

—o—

# హిందీ ప్రచారక విద్యాలయాలు

తెనాలి, విజయవాడ, అవనిగడ్డ, హైదరాబాదుల్లో యీ సంవత్సరంకూడా హిందీ ప్రచారక విద్యాలయాలు నడుపబడును. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు జరిపిన ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులైన వారే యీ విద్యాలయాలలో చేరుటకు అర్హులు. ఈ విద్యాలయాలలో చేరగోరువారు సభ పక్షాన ప్రచురించబడిన ప్రార్థనా పత్రం నింపి వెంటనే కార్యదర్శి, దక్షిణ భారత హిందీ ప్రచార సభ, త్యాగరాయనగర్, మద్రాసు-17 చిరునామాకు పంపవలెను.

ఇట్లు
ద. భా. హిం ప్ర. సభ, ఆంధ్ర
హైదరాబాదు